# మనవి మాటలు

అపుడప్పుడు నేను భారతి, ఆంధ్ర పత్రిక, సౌభాగ్య మొదలగు పత్రికలలో ప్రకటించిన చారిత్రక వ్యాసములే యిపుడు వ్యాస మంజూషలో అందాలు దిద్దుకొనినవి. ఈ వ్యాసములను వ్రాయు నవసరమున సుప్రసిద్ధు లగు రచయితల గ్రంథములను, వ్యాసములను సంప్రదించితిని. ఆయా పత్రికా సంపాదకులకును, రచయితలకును నేను బహుధా కృతజ్ఞుడను.

వ్యాసమంజూషను చదివిన పిమ్మట 'భారత దేశ చరిత్రలో తెలుగువారికి మహోన్నత మగు స్థానము గలదు' అను భావము కలుగుచో నా కృషి ఫలించినట్లే.

ఈ చారిత్రకవ్యాస సంపుటిని పండితు లాదరింతు రనియే నమ్ముచున్నాను. దీనిని సర్వాంగ సుందరముగ ముద్రించియిచ్చిన వెల్డన్ ప్రెస్సు వారికిని కృతజ్ఞుడను.

—చల్లా రాధాకృష్ణ శర్మ

# వి ష య సూ చి క

—:o:—


| | | |
|---|---|---|
| చరిత్ర పరిశోధన – కావలిసోదరులు | ... | 1 |
| బౌద్ధము – ఆంధ్రులు | ... | 29 |
| సంపదల కొటారము తంజపురము | ... | 50 |
| మధుర నేలిన తెలుగురాణి | ... | 65 |
| నాయకరాజులనాటి మధుర | ... | 86 |
| సింహాళము జయించిన తెలుగుమన్నీడు | ... | 106 |

# చరిత్ర పరిశోధన - కావలి సోదరులు

కర్నల్ కాలిన్ మెకంజీ కారణజన్ముడు. దక్షిణా భారత దేశ చరిత్రపరిశోధన అనగానే ఆ మహనీయుని పేరు స్ఫురణకు వచ్చును. వేష భాషలచే ఆయన దాక్షిణాత్యుడు కాక పోయినను, ఆనాళ్ళలో ఆయనవలె చరిత్ర పరిశోధనకై యావజ్జీవితము నంకిత మొనర్చినవారు దాక్షిణాత్యులలోగాని, ఆనాటి ప్రభుత్వోద్యోగులలోగాని మనకు చాలమంది కనబడరు. చరిత్ర పరిశోధకులకు అత్యంత సన్నిహితు డాయన. ఆయన కాలము, ఆయన ధనము, ఆయన విద్య – అన్నియు– చరిత్రపరిశోధనకే వినియోగింపబడినవి. ఆ యనఘాత్ముని ధర్మమా యని నేడు దక్షిణాపథ చరిత్ర రచనకు కావలసిన సాధనసంపత్తి మన కుపలబ్ధ మగుచున్నది. అందువలననే కాలిన్ మెకంజీ కారణజన్ము డనుట !

అరువదినాలుగు కళలను ఆపోశనముపట్టిన అగస్త్యులు మన ప్రాచీన భారతీయులు. ఏ విషయమునైనను సరే సూక్ష్మాతిసూక్ష్మముగా పరిశీలించు నైపుణి వారికి వెన్నతో పెట్టిన విద్య. కంటికి కానవచ్చు విషయములనేకాక, అవా

జ్ఞానస గోచరు డైనభగవంతుని కూడ సాక్షాత్కరింప జేసి కొన్న మహాత్ములు కొందరు మనవారిలో కానవచ్చు చున్నారు. కాని ఒక్క చరిత్రరచన విషయమున మాత్రము ఎందులకోగాని మన పూర్వులు తూష్ణీంభావము వహించిరి. వారికి ఆత్మస్తుతి గిట్టదు. వారిదృష్టిలో పరనిందయు, ఆత్మ స్తుతియు నొక్కటే. ఈభావమును మనస్సున ఉంచుకొనియే కాబోలు ప్రాచీనులు చరిత్రరచనకు ప్రయత్నింపలేదు. ఏమైన నేమి మన పూర్వులకు దేశచరిత్ర యందభిమానము లేదను నొక అపప్రథ ప్రచారమునకు వచ్చినది. కాశ్మీరదేశచరిత్ర యనదగు రాజతరంగిణి రచయిత యగుకల్హణపండితు డొక్కనియందే యీ యపప్రథ చెల్లదు. భారతీయులకు చరిత్రరచన యందభిరుచి కలిగించిన వారు పాశ్చాత్యు లనియే నుడువుట నిజమునకు దగ్గరగా నుండును.

తూర్పు ఇండియా కంపెనీవారి ప్రభుత్వము మన దేశ మున సుస్థిరముగా నెలకొనిన పిమ్మట మనవారిలో కొందరు ఆంగ్లభాషాభ్యాసనమునకు కడంగి తద్భాషా విశారదు లయిరి. తత్ఫలితముగా చరిత్రరచన చేయవలయునను నాశ వారికి పొడమెను. అంపుకు తోడుగా ఆనాటి ప్రభుత్వో ద్యోగులలో కొందరు ప్రాచీన హైందవ చరిత్రను తెలిసికొన నభిలషించిరి. ఆకోవకు చెందినవారిలో కాలిన్ మెకంజీ మహా శీయుని పేర్కొని పిమ్మట మరియొకరిని పేర్కొనుట లెస్స. అతనికి అండదండగా నిలిచి చరిత్ర పరిశోధనకు కావలసిన సామగ్రిని సమకూర్చిన భారతీయులలో కావలి సోదరులకే

ప్రథమ తాంబూలము లభించినది. ఈ కావలి సోదరులు తెలుగువా రగుట మనకు గర్వకారణము.

1783 వ సంవత్సరము సెప్టెంబరు నెలలో వాస్తుశాస్త్రజ్ఞుడుగా కాలిన్ మెకంజీ (మిలిటరీ ఎంజినీర్) మదరాసున అడుగుపెట్టెను. అప్పటి కాయన ముప్పదేండ్ల యువకుడు; ఆరడుగుల రెండంగుళముల దీర్ఘకాయుడు. మెకంజీ 1810 లో ప్రప్రథమ మదరాసు సర్వేయర్ జనరలుగా నియమితుడయ్యెను. మదరాసును మెట్టిననాటినుండియు మహోజ్జ్వలమగు మనప్రాచీన చరిత్రను వివరించు నొకగ్రంథము వ్రాయవలయునని ఆయన నిశ్చయమనస్కుడయ్యెను. అందులకు కావలసిన సాధనసామగ్రి మాత్రము అలభ్యముగా నుండెను. అయినను ఆయన నిరుత్సాహము చెందలేదు. ప్రభుత్వసహాయము నంతగా అపేక్షింపకయే మెకంజీ దొరవారు నిజద్రవ్యమును వినియోగించి ఆంగ్లభాషాభిజ్ఞు లయినభారతీయులను తన గుమాస్తాలుగా నియమించుకొనెను. వారు దేశాటన మొనర్చి శాసనములకును, తాళదళ గ్రంథములకును ప్రతులు తయారుచేసి వానిని ఆయనకు సమర్పింపవలెను. అటులనే ఆ గుమాస్తాలు దక్షిణభారతమునందలి పలుగ్రామములు సందర్శించి ఆయాగ్రామములలో లభించిన తామ్రశిలాశాసనములకును, తాటియాకుల పుస్తకములకును యథామాతృకముగా ప్రతులు తయారు చేసిరి. గ్రామచరిత్రలు సేకరించిరి. జానపదుల జీవితవిశేషాదికమును సవివరముగా తెలిసికొనుటయే కాక వారావిషయాదికమునకు గ్రంథత్వము

కలుగజేసిరి. అటుల మెకంజీ దొరవారి గుమాస్తాలు చరిత్ర రచన కుపకరించు సాధనసంపత్తిని సమకూర్చి మనకు మహోప కార మొనర్చినారనుట సమంజసము. వారికి మార్గదర్శకుడై మెకంజీ మహనీయుడు చరిత్రలో స్థానము సంపాదించుకొని నాడు.

దక్షిణ భారతమునకు సంబంధించిన చారిత్రక, భౌగో ళిక, సాంఘిక, నైతిక విషయములతో నిబిడీకృతమై యున్న మెకంజీ వ్రాతప్రతులు చరిత్రపరిశోధకుల కత్యంతావశ్యక ములు. ''మెకంజీ వ్రాతప్రతుల మూలముననే దక్షిణాపథ ప్రాచీన చరిత్ర మనకు చాలవరకు తెలియవచ్చుచున్నది'' అని సర్ క్లెమెంట్ మార్ఖం పలికిన పలుకు లిట నుదాహరింప దగినవి. ఈ వ్రాతప్రతులు వందలాదిగా నున్నవి. ప్రకృతము చెన్నపురి ప్రాచ్యలిఖిత పుస్తకశాలలో రమారమి నాలుగు వందల సంపుటము లున్నవి. వానిలో కొన్ని పురువుల పాలగు టను చూచి సి. పి. బ్రౌనుదొరవారు వానికి ప్రత్యంతర ములు తయారుచేయించిరి. మదరాసును వీడి కలకత్తాకు పోవు సమయమున మెకంజీ తన స్వస్థలమునకు ఏడు ఫోలియో వాల్యూములు పంపినట్లు తెలియుచున్నది. వానిలో దక్షిణా పథచరిత్రకు సంబంధించిన వివరములు గలవని వేరుగా చెప్ప నవసరము లేదు. ఇప్పు డా వాల్యూము లేమైనవో తెలియ వచ్చుటలేదు. మెకంజీ సేకరణలో వివిధదేశభాషలకు (తెలుగు, తమిళము, కన్నడము, మహారాష్ట్రము మున్నగు నవి) చెందిన 1,568 వ్రాతప్రతులు, 8,076 తామ్రశిలాశాసన

ప్రతులు, 2,630 చిత్రపటములు, 78 ప్లానులు, 6,218 ప్రాచీన నాణెములు, 106 విగ్రహములు మొదలగునవి యుండెనని సర్ క్లెమెంట్ మార్కంహౌరి వ్రాతల వలన విదిత మగుచున్నది. రెవరెండ్ టెయిలర్ ద్వార తయారుచేసిన ప్రాచ్యలిఖిత పుస్తకముల వివరణ గ్రంథమున మెకంజీ సేకరించిన సామగ్రి 570 పుటలలో వివరింపబడినది. ఈ ఒక్క విషయమే చాలును ఆమహనీయుని కృషిని సంభావించి సంతసించుటకు. ఈసాధన సామగ్రిని సేకరించు నిమిత్తమై ఆ పుణ్యాత్ముడు 15,000 పౌనుల ద్రవ్యమును (లక్ష రూప్యములు) వెచ్చించె నని అంచనా వేయబడినది. స్వప్రయోజనములను విస్మరించి కేవలము నిష్కామకర్మగా దక్షిణాపథ చరిత్రరచనకు కడంగిన మెకంజీ దొరవారిని సభక్తికముగా సంస్మరించి ఆయనకు జేజేలు సమర్పించుటకంటె మన మేమి చేయగలము? ఆయనకే కాదు, ఆయనతోబాటు అహర్నిశలు పరిశ్రమించిన గుమాస్తాలకు కూడ జేజేలు! ఎన్నటి కైనను మెకంజీ వ్రాతప్రతులు ముద్రణభాగ్యము నంది వెలుగులోనికి వచ్చు ననియే మనము విశ్వసింతము. ఈ బృహత్కార్యమును మెకంజీ తన గుమాస్తాల తోడ్పాటుతో స్వల్ప కాలములో అనగా 18 యేండ్లలో (1801–1819) నిర్వర్తించి యుండుట గమనార్హము.

మెకంజీ గుమాస్తాలుకూడ మెకంజీవలె చరిత్ర యందభిరుచి కలిగియుండిరి. ఇది యొక గొప్ప విశేషము. వీరే

'మొదటి యాంధ్ర చరిత్ర పరిశోధకులు' అని డా॥ నేలటూరి వేంకటరమణయ్య గారు పేర్కొనుట ఎంతయు సమంజసము. నిజమునకు మెకంజీ వ్రాతప్రతులను సృష్టించినవారు ఈ గుమాస్తాలే. వారు గ్రామ గ్రామము తిరిగి చారిత్రక, సామాజిక. మతవిషయము లనేకములు సేకరించిరి. కనుక మెకంజీ వ్రాతప్రతులు కేవలము చారిత్రకముగానే కాక సాంఘికముగా కూడ ప్రాధాన్యము వహించుచున్నవి.

మెకంజీ గుమాస్తాలకు నాయకమణిగా విరాజిల్లినవాడు శ్రీ కావలి వేంకట బొర్రయ్య యను యశఃకాయుడు. ఆయన మహామేధావి. బహుముఖ ప్రతిభాశాలి. సహనశీలి. సంస్కృతాంధ్రాంగ్ల హిందూస్థానీ పారశీక భాషలలో ప్రవీణుడు. పండితుడు. కవి. ఆయన మధురప్రకృతియు, అచంచల కార్యదీక్షయు మెకంజీ దొరవారిని మిక్కిలిగా నాకర్షించినవి. అందువలననే ఆయన యాదరాభిమానములను బొర్రయ్య చూరగొనుటలో ఆశ్చర్యము లేదు.

## వేంకట బొర్రయ్య

కావలివారు ఆర్వేలనియోగి బ్రాహ్మణులు. ఈ వంశమున ప్రభవించినవారిలో కొందరు విజయనగర సమ్రాట్టుల యొద్దను, గోల్కొండ నవాబులయొద్దను అమాత్యులుగా నుండి అఖండ యశస్సు నార్జించిరి. వేంకట బొర్రయ్య పశ్చిమ గోదావరి మండలములోని ఏలూరు పట్టణమున 1776 వ సంవత్సరమున వేంకట సుబ్బయ్య దంపతులకు జన్మించెను. వేంకట

సుబ్బయ్యగారికి వేంకట నారాయణప్ప, వేంకట బొజ్జయ్య, వేంకటలక్ష్మయ్య, వేంకటరామస్వామి, సీతయ్య అను నైదుగురు కుమారులును, ఒక కుమార్తెయు కలిగిరి. ఆమె పేరు తెలియరాలేదు. విస్సన్నపేట జమీందారుని ఆమె వివాహమాడినట్లు మాత్రము స్పష్ట మగుచున్నది.

వేంకట బొజ్జయ్య చదువుసంతలు ఏలూరులోని యొక పాఠశాలలో ప్రారంభ మయ్యెను. పదియేండ్లు వచ్చునంత వరకు అతడు ఏలూరునందే విద్యాభ్యాస మొనర్చెను. పాఠశాలలో తెలుగును, ఇంటియొద్ద సంస్కృతమును అతడు నేర్వసాగెను. సంస్కృతము నభ్యసింప మొదలిడిన యారు నెలలలోనే బొజ్జయ్య శ్లోకరచన చేయజొచ్చెనట! అతని బుద్ధి విశేష మట్టిది! విద్యార్థిగానున్న దినములలోనే అతడు మేధావి యనియు, చురుకైనవాడనియు ప్రసిద్ధి కెక్కెను. అప్పటికే యతని యగ్రజుడగు నారాయణప్ప తూర్పు ఇండియా కంపెనీవారి కొలువులో నుండెను. కంపెనీవారి యుద్యోగమును పొందుటకు హిందూస్థానీ పారశీకములలో పరిజ్ఞానమత్యవసర మై యుండెను. ఇవి అప్పటి రాజభాషలు. ఏలూరునకు దగ్గరగానున్న కొత్తూరు అను గ్రామమున ఈ రెండు భాషలు నేర్చిన యొక మహమ్మదీయు డుండెను. అతనియొద్ద బొజ్జయ్య హిందూస్థానీ పారశీకముల నభ్యసించెను. అటుపిమ్మట ఆంగ్ల విద్యాభ్యాసనముకూడ అవసర మని తలచి అతడు మచిలీపట్టణమునకు చనెను. అప్పటి కతడు పదునాలు గేండ్ల యువకుడు.

# 8

మచిలీపట్టణమున మిస్టర్ మోర్గస్ పాఠశాలలో వేంకట బొట్టయ్య ఆంగ్లము నభ్యసింపజొచ్చెను. తీరిక వేళలందు తెలుగు ప్రబంధములను – ముఖ్యముగా అత్తలూరి పాపకవి విరచిత కావ్యములను – ఛందోవ్యాకరణ శాస్త్రము లను అతడు చదువుచుండెడివాడు. అత్తలూరి పాపకవి కావలివారికి బంధుకోటిలోనివాడట. అటుల చిరుతవయసు ననే బొట్టయ్య బహు భాషలలో పాండిత్యము గడించెను. ఈ బహుభాషాభిజ్ఞతయే అతని తరువాతి జీవితమునకు మెరుగులు దిద్దినది; అతని చరిత్ర పరిశోధనకు తోడ్పడినది.

మచిలీపట్టణమున ఆంగ్ల విద్యాభ్యాసము పూర్తిచేసి కొని వేంకట బొట్టయ్య ఏలూరునకు పోయెను. అచ్చట సిపాయి దళమున కధిపతిగానున్న పియర్స్ దొరతో అతనికి పరిచయము కలిగెను. తత్ఫలితముగా మచిలీపట్టణము నందలి మిలిటరీ పేమాస్టర్ ఆఫీసులో (సైన్యమునకు జీతము నొసగు కార్యాలయము) రైటరుగా బొట్టయ్య నియ మితు డయ్యెను. మునగాల, కొండపల్లి మొదలగు ప్రదేశ ములనున్న సైన్యమునకు కూడ జీతము నిచ్చుటకు బొట్ట య్యనే అధికారులా యాచోట్లకు పంపుచుండిరి. పై యధి కారుల యాదరాభిమానముల కతడు పాత్రు డయ్యెననుట కీవిషయము తార్కాణ. రైటరు ఉద్యోగమున బొట్టయ్య నాలుగేండ్లు పనిచేసెను. అంతలోనే అతనికి పెద్ద గుమాస్తా యుద్యోగము కూడ లభింపనుండెను. కాని అదృష్టవశమున

బొర్రయ్య మెకంజీ దొరవారి పెద్ద గుమాస్తాగా నియమింప బడెను. అప్పటికి అతని వయస్సు పంతొమ్మిదేండ్లు.

ఆసమయమున— అనగా 1792–98 సంవత్సరములలో— సర్వేచేయు నిమిత్తమై మెకంజీ దొర హైదరాబాదులో మకాము చేసియుండెను. అప్పుడు ద్విభాషి నారాయణప్ప తన తమ్ముడగు బొర్రయ్యను మెకంజీకి పరిచయము గావించెను. ఏ సుముహూర్తమున వారిరువురును కలసికొనిరో కాని బొర్రయ్య మెకంజీలు దక్షిణభారత చరిత్ర పరిశోధనకు—— ముఖ్యముగా ఆంధ్రులచరిత్ర రచనకు —— పునాది వేసిన వారయినారు.

నేడు మెకంజీ వ్రాత ప్రతులని వ్యవహృతమగుచున్న చారిత్రక లేఖనములను సృష్టించినవారిలో వేంకట బొర్రయ్య చాల విశిష్టుడనుట సముచితము. చరిత్ర రచనకు కావలసిన సామగ్రిని సేకరించుటయే అతని యుద్యోగ ధర్మమై యుండెను. తద్ధర్మ నిర్వహణమునకే అతడు తన జీవితమును మీదుకట్టెను. ఆ నాళ్ళలో చక్కని బాటలుగాని, ప్రయాణ సౌకర్యములు గాని లేవనియే నుడువదగును. విపినవీధు లందును, పర్వత ప్రాంతములందును బొర్రయ్య ప్రయాణము చేయవలసి యుండెను. శ్రీశైలమున అతడు కొంత కాలము నివసించెనని ప్రవ్యక్తమగు చున్నది. భోగములకు ఆమని యనదగు యౌవనమున బొర్రయ్య భోగలాలసుడుగాక చరిత్ర పరిశోధకునిగా కాలము గడపియుండుట గమనింప

దగునంశము. మెకంజీ దొరవారే అతని యచంచల కార్య దీక్షను. సౌజన్యమును చూచి ముగ్ధులయిరి. నూతన విషయములను గూడ అనాయాసముగా గ్రహించువాడనియు, పరిస్థితుల కనుగుణముగా సంచరించు నేర్పుగలవాడనియు మెకంజీ బొర్రయ్యను కొనియాడెను.

1797 వ సంవత్సరమున మనిలాలో ఒక తిరుగుబాటు జరుగుటచే కంపెనీవారు మెకంజీని దాని నణచుటకై మనిలాకు పంప నిశ్చయించిరి. అందువలన అతడు హైదరాబాదును వీడి మదరాసు చేరి అటనుండి మనిలాకు పయనమయ్యెను. కాగా, బొర్రయ్య స్వస్థలము చేరవలసివచ్చెను. ఇంటియొద్ద నున్నను బొర్రయ్య చారిత్రక దృష్టిమాత్రము హ్రస్వము కాలేదు. చారిత్రకాంశములను సేకరింపగోరి అతడు సాహిత్యాధ్యయనము చేయసాగెను. ఎడనెడ సంస్కృతాంధ్రములందు కవిత లల్లుచుండెడివాడు.

మనిలా తిరుగుబాటు ముగిసిన పిమ్మట మెకంజీ హైదరాబాదు చేరుకొనెను. బొర్రయ్య కూడ మెకంజీని కలసికొని చరిత్ర పరిశోధనకు కడంగెను. అతని ప్రశాంత పరిశోధనమునకు మరల విఘ్న మేర్పడెను. పదునెనిమిదవ శతాబ్దపు చరమభాగము కంపెనీవారికి పరీక్షా సమయముగా పరిణమించెను. మైసూరు సుల్తాను ఒక వైపునను. మరియొక వైపున ఫ్రెంచివారి ప్రేరణమున హైదరాబాదు నవాబును ప్రక్కలోని బల్లెము లై కంపెనీవారిని బాధింప జొచ్చిరి.

తుదకు 1798 వ సంవత్సరమున కంపెనీవారు మైసూరు ప్రభువు టిప్పుసుల్తానుతో యుద్ధము ప్రకటించిరి. ఆ యుద్ధమున మెకంజీవారు కూడ పాల్గొనవలసి వచ్చెను.

పిమ్మట హైదరాబాదునుండి మెకంజీతో కూడి బొర్రయ్య కూడ మైసూరునకు బయలుదేరెను. ప్రయాణమైన నాటి నుండియు అతడు 'దినచర్య' వ్రాయదొడగెను. తెనుగున దినచర్య వ్రాసినవారిలో బొర్రయ్యయే ప్రథముడు. మార్గ మధ్యమున – గద్వాలలో–ఒక దుస్సంఘటన సంభవించెను. గద్వాలలోని జమీందారు మనుష్యులు కొందరు మెకంజీ యొద్దనున్న ఔద్యోగిక పత్రముల నపహరించిరి. వానిని వెదకి తెమ్మనిచెప్పి మెంకజీ మైసూరునకు ప్రయాణము సాగించెను. బొర్రయ్య గద్వాలయందే యుండి మెకంజీ కాగితములకై గాలించుచుండగా అతని నా జమీందారు చెరసాలయందు బంధించెను. పాపము! బొర్రయ్యకు పట్టెడు మెతుకులు కూడ కరవయ్యెను! ఆ చెరసాలలో అతడు యమయాతన లనుభ వించెను. అట్టి విషమ పరిస్థితిలో కూడ బొర్రయ్య ప్రశాంత చిత్తుడై యుండెను. అతని సహనమును చూచి జమీందారు చకితుడయ్యెను. బొర్రయ్య జమీందారుపై కొన్ని పద్య ములు వ్రాసి అతనికి పంపెను. వానిని చదువగనే అతని హృదయము దయార్ద్రమయ్యెను. తా నొనర్చినది పాప కార్యమని అతడు పశ్చాత్తప్తుడయ్యెను. తోడనే బొర్ర య్యను బంధ విముక్తునిగా చేసెను. అంతేకాక ఆ జమీం

దారు అతనిని ఘనముగా సత్కరించి, మెకంజీ పత్రములను కూడ అతని పరము చేసెను.

అటు పిమ్మట బొర్రయ్య మెకంజీని కలసికొని సైన్యముల ననుసరించి శ్రీరంగ పట్టణమును చేరెను. టిప్పు సుల్తానుతో జరిగిన యుద్ధమున విజయము కంపెనీవారికే లభించెను. శ్రీరంగ పట్టణము వారి వశ మయ్యెను. ఆ పట్టణమును కంపెనీవారు ముట్టడించు నపుడు అచ్చటనే యుండి ఆదృశ్యమును కన్నులార గాంచిన బొర్రయ్య దాని నభివర్ణించుచు గంభీర భావబంధురము లగుపద్యములు కొన్ని సంతరించెను. ఉభయ పక్షములవారి బలాబలములు, కంపెనీవారు తమపతాకను కోటబురుజులపై ఎగురవేసిన పద్ధతి— మొదలగు విషయము లా పద్యములలో వర్ణింపబడెను. బొర్రయ్య కమనీయ కవితాశక్తికి ముగ్ధుడై మెకంజీ అనేక బహుమతు లొసగి అతనిని గౌరవించెను.

శ్రీరంగపట్టణము కంపెనీవారి స్వాధీనమైన పిదప అచ్చటి పరిస్థితులను చక్కబరచు నుద్దేశముతో 1779 వ సంవత్సరమున జూను నెలలో, ఒక కమిషను నియమింపబడెను. సరిహద్దులను నిర్ణయించుటకై సలహాదారుడుగా ఆ కమిషను వారికి కాలిన్ మెకంజీ నియుక్తు డయ్యెను. కాగా, అతడు మదరాసునుండి మైసూరునకు పోయెను. 1800 సంవత్సర ప్రాంతమున మెకంజీ మైసూరు సర్వేకు కడంగెను. ఆసందర్భమున బొర్రయ్య మెకంజీతో కూడి చిత్తల

దుర్గము, బెంగుళూరు, నిజగల్లు మొదలగు ప్రదేశములందు సంచరించి ఆయా ప్రదేశములందు లభ్యమయిన చారిత్రకాంశములను సేకరించెను. చరిత్రయందతనికి గాఢాభిలాష కలదనుట కిదియొక నిదర్శనము. ఈ గాఢాభిలాషయే అతనిని చరిత్ర రచనమునకును పురికొల్పినది. మైసూరు నేలిన రాజుల చరిత్రను, మైసూరునకు తొలుదొలుత రాజధానీ నగరముగా విరాజిల్లిన ఉమ్మత్తూరు చరిత్రను వర్ణించుచు బొఱ్ఱయ్య యొక కావ్యము వ్రాసెను. దాని కతడు 'శ్రీరంగరాయ చరిత్రము' అని పేరిడెను. కాంచీపుర మాహాత్మ్యమునుకూడ రచించెను.

1800 సంవత్సరముననే బొఱ్ఱయ్య యింకొక కావ్యము కూడ వెలయించెను. మహారాష్ట్ర నాయకు డగుధూండియా యను నతనిని వెల్లస్లీ హరిహర్ అనుచోట జయించెను. అపుడు బొఱ్ఱయ్య అచటనే యుండెను. వెల్లస్లీ విజయ గాథను అతడు కావ్యముగా సంతరించెను. ఆ కావ్యమును తిలకించి జనరల్ కాంబెల్ ప్రభృతులు మిక్కిలి సంతసించి యతనిని బహువిధముల ప్రశంసించిరట! అటుపిమ్మట బొఱ్ఱయ్య హరిహర్‌లోనే యున్న యొక యోగిపై నూరు పద్యములు చెప్పెను. బొఱ్ఱయ్య రచనములలో పేర్కొనదగినవి మరికొన్ని కూడ గలవు. 'జైనులవృత్తాంతము' అను నొక చారిత్ర లేఖనము నత డాంగ్లములోని కనువదించెను. మహారాష్ట్ర భాషలో నున్న 'హైందవ ప్రభుత్వము నశించిన పిదప మొగలుల ప్రభుత్వములో కర్ణాటకమున ఏర్పడిన

ముఖ్య రాజకీయ సంఘటనలు' అను దానిని కూడ ఆంగ్లము చేసెను. అది మెకంజీ వ్యాఖ్యతో "Dalrymple's Oriental Reportery" లో ప్రకటింపబడెను.

1801 వ సంవత్సరమున చెన్నపురిలోని జార్జి కోటలో మెకంజీ యొక అధికారిగా నియమితు డయ్యెను. అందువలన బొర్రయ్య కూడ మదరాసునకు చేరుకొనెను. వారిరువురును మరల చరిత్ర రచనమునకు దిగిరి. ప్రాచీనలిపిలో నున్న తెలుగు శాసనములను చదివి వానికి ప్రతులు వ్రాయుట, దేశభాషలలో నున్న చారిత్రక లేఖనములను సంశోధించుట, వానిలో ముఖ్యములైన వానిని ఆంగ్లము చేయుట మొదలగు పనిపాటులలో బొర్రయ్య మునిగి తేలుచుండెడివాడు. అటుల రెండు సంవత్సరములు గడిచెను. శాసనములను చదువుటలో కూడ బొర్రయ్య అందెవేసినచేయి. దాదర అను గ్రామమున హళెకన్నడములో చెక్కబడిన శాసన మొకటి లభించెను. అందలి యక్షరముల నెవరును గురుతింపలేక పోయిరి. ఆశాసనమును ప్రథమముగా చదివినఖ్యాతి బొర్రయ్యకే దక్కినది. అతని ప్రతిభకు మెకంజీ జోహారు లర్పించినాడు. అంతేకాదు. దాదర శాసనమున అధోభాగమున బొర్రయ్య పేరును చెక్కించి ఆ విధముగా మెకంజీ యతనికి చిరంజీవిత్వము సమకూర్చుటయే కాక తన సహృదయతకు కూడ చిరంజీవిత్వము సమకూర్చుకొనెను. పిమ్మట మెకంజీ ఆ దాదర శాసనమును రాయల్ ఏషియాటిక్ సొసైటీలో భద్రపఱచెను.

మెకంజీ దొరవారి సహాయమున బొర్రయ్య ఒక్క చరిత్ర పరిశోధనయందే కాక పాశ్చాత్య విజ్ఞాన శాస్త్రము లందును ప్రవీణు డయ్యెను. మెకంజీ సహృదయత కది మరియొక దృష్టాంతము. ఇతరులనుండి తాను క్రొత్తవిషయములను తెలిసికొనుటతోనే తృప్తిచెందక ఆయన యితరులకు వా రెరుగని విషయములను తెలియజేసెడివాడు. ఆయన మధుర ప్రకృతి యట్టిది! గణితము, రేఖాగణితము, జ్యోతిషము, భూగోళము— ఇంకను మరికొన్ని శాస్త్రములను మెకంజీ సాయమున బొర్రయ్య నేర్చెను. ప్రాచ్యపాశ్చాత్య విజ్ఞానశాస్త్ర సంప్రదాయములను జీర్ణించుకొనెను. భూగోళశాస్త్ర పటముల నతి సుందరముగాను, పరిశుభ్రముగాను బొర్రయ్య వ్రాసెడివాడట! అటుల అన్ని విషయములందును అతడు నిష్ణాతుడనిపించుకొనెను. కాని యేమిలాభము? ఇరువది ఆరేండ్ల చిన్నవయసుననే బొర్రయ్య యీలోకమునుండి నిష్క్రమించెను. అతడే కనుక మరికొంత కాలము సజీవుడై యుండెనేని నూతనములగు విషయము లింకను బయల్పడియుండెడివి!

ఆధునిక విజ్ఞాన శాస్త్రాభ్యసనమున బొర్రయ్యకు మెకంజీ గురుప్రాయుడైనట్లుగానే భారతదేశచరిత్ర పరిశోధన విషయమున బొర్రయ్య మెకంజీకి గురుప్రాయు డగుట గమనార్హము. సర్వే కార్యకలాపములందే కాక చరిత్ర పరిశోధనమునందును అతడు మెకంజీకి చాల తోడ్పడెను. గ్రామ గ్రామము తిరిగి చరిత్రరచనకు కావలసిన శాసనాదిసామగ్రిని సేకరించి, ఆసేకరించినసామగ్రిని చారిత్రక దృష్టితో పరిశోధించి

నాడు బొర్రయ్య. 'ప్రతిభావంతుడైన బొర్రయ్యవలన హైందవ విజ్ఞానమున కొక క్రొత్తపుంత యేర్పడినది' అని మెకంజీ పేర్కొనుట విస్మరింపరాని విషయము. ఆతని సహాయము ననే తాను హైందవ విజ్ఞాన మందిర ప్రాంగణమును ప్రవేశింప గలిగితి ననియు, భారత దేశభాషలలో పరిజ్ఞానము సంపాదింప గలిగితి ననియు మెకంజీ బొర్రయ్యకు జోహారు లర్పించెను.

మైసూరు సర్వే ముగిసిన పిదప దానికి సంబంధించిన పట ములు, నివేదికలు మున్నగువానిని తయారు చేయుటలో మెకంజీ నిమగ్నుడై యుండెను. అనగా మెకంజీ, బొర్రయ్య ప్రభృతులు కష్టనష్టముల కోర్చి సేకరించిన వివిధ విషయముల నొక నివేదిక మూలముగా ప్రభుత్వమువారికి తెలియజేయు టకై ప్రయత్నము జరుగుచుండిన కాలమున, 1903వ సంవత్స రము జనవరి ఏడవ తేదీని వేంకట బొర్రయ్య స్వర్గస్థుడయ్యెను. అతని యకాల మరణము మెకంజీ హృదయమును శోకార్ణవ మొనర్చెను. అనంతరము బొర్రయ్యకు స్మారకచిహ్నము నొకటి మెకంజీ యేర్పాటు చేసెను. అది మదరాసులో సము ద్రపు టొడ్డున జార్జికోట కెదురుగా నిర్మింపబడినట్లు తెలియు చున్నది. కాని ఆస్మారకచిహ్నము నేడు కానరాకపోవుట మన దురదృష్టము.

బహుముఖ ప్రజ్ఞామూర్తియైన వేంకట బొర్రయ్య జీవిత విశేషాదికమును అతని సోదరుడగు వేంకట రామస్వామి తన 'దక్కనుకవుల చరిత్రము' అను నుద్గ్రంథమునఅభివర్ణించినాడు.

అటుపిమ్మట 1834 వ సంవత్సరమున చెన్నపురిలో ప్రచురింపబడిన రాయల్ ఏషియాటిక్ పత్రికలో అతని జీవితము ముద్రిత మగుటచే ఆనాటి పెద్దలు, బొఱ్ఱయ్య చరిత్రకు కావించిన యమూల్య మగుసేవను గుర్తించినా రని నిస్సంశయముగా నుడువదగును. వేంకట బొఱ్ఱయ్య చరితార్థుడు! ఆయన అమరజీవి! శ్రీ నిడుదవోలు వేంకటరావుగారు నుడివినట్లు "నేఁడు చరిత్ర రచనమునందు శ్రీ కారము చుట్టెడి వారందరును శ్రీ బొఱ్ఱయ్యగారిని స్మరింపవలసినదే." *

* వేంకట బొఱ్ఱయ్య మరణించిన పిమ్మట అతనిని గూర్చి మెకంజీ కంపెనీవారికి వ్రాసిన యొక లేఖనుండి కొన్ని వాక్యముల నిట నుదాహరించుచున్నాను.

"The connection then formed with one person, a native, a bramin, (the lamented V. C. Boriah, then almost a youth of the quickest genius and disposition, possessing that conciliatory turn of mind,...) was the first step of my introduction into the portal of Indian knowledge; devoid of any knowledge of the languages myself, I owe to the happy genius of this individual, the encouragement and the means of obtaining what I had so long sought ...... from the moment the talents of the lamented Boriah were applied, a new avenue to Hindoo knowledge was opened and though I was deprived of him at an early age, his example and instruction were so happily followed up by his brethren and disciples......"

# వేంకటలక్ష్మయ్య

అదేమి చిత్రమో తెలియదు కాని కావలి సహోదరు లందరు చరిత్ర పరిశోధకులుగా చిరయశస్సు గడించినారు. బొర్రయ్య మరణానంతరము అతని తమ్ముడగు వేంకటలక్ష్మయ్య ఆస్థానము నాక్రమించెను. అతనిలో బొర్రయ్య యందున్న విశిష్టగుణము లన్నియు మూర్తీభవించి యుండుట గొప్ప విశేషము. అన్నివిధముల అన్నకు తగిన తమ్ము డతడు! అందువలననే అతడు మెకంజీ యాదరాభిమానములకు పాత్రుడయ్యెను.

హైదరాబాదులో 1798 వ సంవత్సరము మేనెలలో వేంకటలక్ష్మయ్య మెకంజీయొద్ద ద్విభాషిగా చేరెను. 1803 లో అతడు మెకంజీ గుమాస్తాలకు నాయకుడుగా నియమితుడయ్యెను. అప్పటి యతని జీతము 40 వరహాలు. అంత పెద్ద జీతము మెకంజీ గుమాస్తాలలో పొందినవాడు ఒక్క లక్ష్మయ్యయే. అర్హతనుబట్టి మెకంజీ తన గుమాస్తాలకు జీతము లిచ్చుచుండెనని తెలియుచున్నది. కాని లక్ష్మయ్య విషయమున ఒక్క అర్హతనేకాక, అతని కుటుంబ పరిస్థితులను కూడ మనస్సు నందుంచుకొని మెకంజీ అతని కా జీతము నేర్పాటు చేసియుండెను.

కావలి సోదరుల కుటుంబ పరిస్థితు లెట్టివో మెకంజీ జాన్ రిడ్డెల్ దొరకు వ్రాసిన లేఖనుండి మనకు విశద మగుచున్నవి. "నాయొద్ద గుమాస్తాలుగా చేరుటకై వచ్చిననాటికి

ఆ నలుగురు సోదరులును నిర్ధనులే. వా రొక గౌరవకుటుంబ మునకు చెందినవారు. ప్రస్తుత మా కుటుంబము చితికిపోయి నది. ఏ విధమైన ఆస్తియు వారికి లేదు. నే నొసగుచున్న ద్రవ్య ముతో వారు తమ పెద్దకుటుంబమును పోషించుకొను చున్నారు. ఈ జీతములతో—15, 20, 25, 35 వరహాలు— వారు ఏలూరు, మచిలీపట్టణము, మదరాసు ఈ మూడుచోట్ల ఏడో, ఎనిమిదో కుటుంబములను పోషించుచున్నారు.''

మెకంజీ వాక్యములనుబట్టి చూడగా కావలివారి కుటుంబము చాల పెద్ద దనియు, అది చితికిపోయె ననియు విదిత మగుచున్న ది. ఈవిషయాదికమును గ్రహించియే మెకంజీ లక్ష్మయ్యకు ఎక్కువజీతము నొసగెను. మరియొకసందర్భమున లక్ష్మయ్య సౌశీల్యమును కొనియాడుచు మెకంజీ యిట్లు పేర్కొనెను. ''అతడు డబ్బు విషయమున నన్నెన్నడును మోసగించి యుండలేదు...జాగరూకత కలిగిన భృత్యుడు... స్వసౌఖ్యములను కూడ సరకుసేయక అతడు నాకై శ్రమించిన విషయమును నేను బాగుగా నెరుగుదును...అతడు నిర్ధనుడు; కాని నిజాయితి గలవాడు.'' కనుక లక్ష్మయ్య సత్యశీలు డని స్పష్ట మగుచున్న ది. అతని ఋజు ప్రవర్తనము మెకంజీని మిక్కిలిగా నాకర్షించినది. కాదు, కరుణార్ద్రహృదయునిగా చేసినది.

బొర్రయ్యవలె లక్ష్మయ్య కూడ చారిత్రక దృష్టిగల వాడు. చరిత్ర రచనమున కుపకరించు వ్రాత ప్రతులు, శాసన

ములు మొదలగువానిని సేకరించుటలో అతడు ప్రముఖపాత్ర వహించినట్లు తెలియుచున్నది. మెకంజీ మైసూరు సర్వే కావించిన సందర్భమున, లక్ష్మయ్య కూడ అందు పాల్గొనెను.

లక్ష్మయ్య మహాసమర్థుడే యైనను, అతని జీవితము మాత్రము ప్రశాంతముగా సాగిపోలేదు. జీవితము నందలి వెన్నెలనే కాక అందలి చీకటిని కూడ అతడు దర్శించినాడు. 1811 వ సంవత్సరమున మెకంజీ ఉద్యోగ ధర్మమున జావాకు పోవలసివచ్చెను. 1815 వరకు అత డచ్చటనే యుండెను. తనకు తోడునీడగా నున్న మెకంజీ దగ్గరగా లేని కారణమున, ఆ నాలుగేండ్లు లక్ష్మయ్యకు నాలుగు యుగములుగా గడ చెను. ఆర్థికముగా అతడు పడరానిపాట్లు పడెను. అప్పుల పాలయ్యెను. తత్ఫలితముగా 1817 లో అతడు కారాగార వాస శిక్ష ననుభవింపవలసి వచ్చెను. అతడు చేసిన అప్పు లతనిని అంతదూరమునకు తీసికొనిపోయెను.

లక్ష్మయ్య చెరసాలలో బంధింపబడిన విషయమును తెలిసికొని మెకంజీ మిక్కిలి పరితపించెను. ఆ పరితాపము వర్ణనాతీతము! జావానుండి మదరాసునకు తిరిగి వచ్చిన పిదప 1817 వ సంవత్సరమున మెకంజీ దొరవారు ప్రప్రథమ భారత సర్వేయర్ జనరల్‌గా నియమితు లయిరి. కాగా, ఆయన నివాసస్థానము కలకత్తా నగరమునకు మారెను. మదరాసును వీడి కలకత్తాకు పోవుటకు ఆయన సహర్షముగా సమ్మతింప లేదు. కలకత్తా చేరిన పిమ్మట ఆయన మదరాసున తనతో కూడి చరిత్ర పరిశోధనమున పరిశ్రమించిన లక్ష్మయ్య ప్రభృ

తులను కలకత్తాకు రప్పించుకొనదలచెను. లక్ష్మయ్య ఆనాళ్ళలో మెకంజీకి కుడిబుజముగా నుండెను. అతనిరాకకై నిరీక్షించిన మెకంజీకి లక్ష్మయ్య చెరసాలలో బంధింపబడె నను దుర్వార్త పిడుగుపాటుగా తోచుటలో ఆశ్చర్య మావంతయు లేదు. లక్ష్మయ్య సచ్ఛీలు డనియే సంభావించిన యాదొర మదరాసులోని జాన్ రిడ్డెల్ దొరకు వ్రాసిన లేఖ లాతని సత్ప్రవర్తనమునకు మెరుగులు దిద్దునట్టివిగా నున్నవి.

మెకంజీ దొరవారు 1810 లో లక్ష్మయ్యకు కొంత ధనము నొసగియుండిరి. ఆ ధనముతో అతడు సర్కారు జిల్లాలలో ఎచ్చటనైనను భూవసతి నేర్పాటు చేసికొనునని మెకంజీ యాశించెను. కాని యాసంవత్సరముననే లక్ష్మయ్య బావగారు (విస్సన్నపేట జమీాందారు) మరణించిన హేతువుచే మెకంజీ తనకిచ్చిన ధనమును అతడు తన సోదరికి అప్పిచ్చెను. కాని దురదృష్టవశమున విస్సన్నపేట జమీాందారీ విషయము రచ్చకెక్కినది. ఆ విషయము తుదకు ప్రీవీకౌన్సిలువరకును పోయెను. కడపట 1867 వ సంవత్సరమున విస్సన్నపేట జమీాందారీ బొర్రయ్య వంశీయులకే చెందవలయు నని కోర్టువారు తీర్మానించిరి.

అటు పిమ్మట మెకంజీ లక్ష్మయ్యకు మదరాసుననే ఒక గృహమును కొని దానిని అతని వశము చేసెను. అంతే కాక కొంత భూమిని కూడ ఆ పుణ్యాత్ముడు లక్ష్మయ్య పేరున వ్రాసి యిచ్చెను. కాని లక్ష్మయ్య అదృష్టహీనుడు! ఈర్ష్యాన్వితులైన యతని బంధువులు కొందరా భూమిని తమ స్వాధీ

నము చేసికొను దురుద్దేశముతో లక్ష్మయ్యను ముప్పతిప్పలు పెట్టిరి. పాప మా యమాయకుడు మెకంజీ యిచ్చిన ఆభూమిని అప్పులవాండ్రకు తాకట్టుగా పెట్టెను. హృదయవిదారక మగు నా విషయమును తెలిసికొని మెకంజీ ఒకచోట "To mortgage the village granted to him is very mortifying, but what is to be done else?" అని వ్రాసెను. అప్పటికిని లక్ష్మయ్య ఋణ విముక్తుడు కాలేదు. 5,000 వరహాల అప్పును తీర్చనిదోషమున అతడు చెరసాలలో బంధింపబడెను. అంత ఋణము తాను చేయనే లేదని లక్ష్మయ్య వాదించెను. అతని బంధువుల చూపోపమిచే అతడు కష్టముల పాలయ్యెనని నుడువుట సత్యసన్నిహితము. 4,000 వరహాలు లక్ష్మయ్య అప్పులవాండ్ర కొసగిన చో చాలునని కోర్టువారు తీర్మానించిరి. ఆ విధముగా లక్ష్మయ్య బంధు సమూహాముచే వంచింపబడెను. ఆ విపత్సమయమున అత డనుభవించిన మానసిక సంక్షోభ మా సర్వేశ్వరునికే యెరుక !

కారాగృహ శిక్ష ననుభవించుట అవమాన హేతువుగా గణింపబడుచుండె నను విషయమును మెకంజీ దొర యొక లేఖలో ఇట్లు పేర్కొనెను. "I cannot help still being uneasy for the poor man (Lakshmaiah) knowing the nice disgrace they attach to being put in gaol" అమృతహృదయు డైన మెకంజీ దొరవారే కనుక సహాయము సలుపకున్న చో లక్ష్మయ్యగతి యే మైయుండెడిదో మన మూహించుకొనవలసిన దే. కాని అట్టి దుర్గతికి లక్ష్మయ్యను

పాల్పడనీయక ఆత్మీయునికంటె నెక్కుడుగా ప్రేమించి అత నిని కష్టజలధినుండి గట్టెక్కింపజేసిన మెకంజీ సహృదయ తను ఏమని కొనియాడగలము! ఎంతని కొనియాడగలము!

అప్పులవాండ్రనుండి బయటపడిన పిదప మెకంజీ యాజ్ఞను తలదాల్చి లక్ష్మయ్య కలకత్తాకు బయలుదేరెను. ఇతర గుమాస్తాలంతకు పూర్వమే కలకత్తాకు పయనమయిరి. వారిని లక్ష్మయ్య మచిలీపట్టణమున కలసికొనెను. ఆనాళ్ళలో సముద్రయానము మహా పాపకార్యముగా గణింపబడు చుండెను. కనుక సముద్రప్రయాణ మొనర్చుటకు వారు ముందు వెనుకలు చూచిరి. అందువలన మెకంజీ వారి కల కత్తా ప్రయాణమునకు తగిన యేర్పాటులు చేసెను. అనేక వ్రాతప్రతులతో తుట్టతుదకు 1818 వ సంవత్సరము మే నెలలో లక్ష్మయ్య కలకత్తా చేరి మెకంజీ దొర వారిని కలసి కొనెను. అప్పు డాదొరవారు పొందిన సంతోషమునకు మేరయే లేదు.

కలకత్తాలో మెకంజీ దొరవారు మరణించునాటివరకు— 1821 వ సంవత్సరమువరకు – లక్ష్మయ్య ఆయనకు చరిత్ర పరి శోధనమున తోడ్పడుచునే యుండెను. మెకంజీ మరణానంత రము కూడ రెండేండ్లు కలకత్తాయందే యుండి అతడు డాక్టర్ విల్సన్ దొరకు క్యాటలాగు తయారు చేయుటలో తోడ్ప డెను. 1823 వ సంవత్సరమున లక్ష్మయ్య కలకత్తాను వీడి మదరాసు చేరెను.

చెన్నపట్టణము చేరిన పిమ్మట కూడ లక్ష్మయ్య చరిత్ర పరిశోధనమునందే కాలము వెళ్ళబుచ్చెను. సర్ అలె గ్జాండరు జాన్‌స్టన్ దొరవారి ప్రోత్సాహమున అతడు చెన్న పట్టణమున 'హైందవ సారస్వత సమాజము' అను నొక సాహిత్యమండలిని స్థాపించెను. దానికతడే తొలి యధ్యక్షుడు. మెకంజీ వ్రాతప్రతులను లెస్సగా శోధించుట, ముఖ్య మని తోచు వ్రాతప్రతులకు ఆంగ్లానువాదములు వెలయించుట మొదలగునవి యా సమాజపు టాశయములు. అటుపిమ్మట 1830 వ సంవత్సరమున అప్పటి మదరాసు ప్రభుత్వము వారిని మెకంజీ వ్రాతప్రతులను హైందవ సారస్వత సమాజము వారిపరము చేయుడని లక్ష్మయ్య యర్థించెను. అటులనే ప్రభుత్వమువారును ఆ వ్రాతప్రతులను హైందవ సారస్వత సమాజమువారి స్వాధీన మొనర్చిరి. Royal Asiatic Society of Great Britain సహాయ సభ్యుడుగా లక్ష్మయ్య, తాను ప్రాచీన భారతీయ రాజవంశములను గూర్చి పరిశోధన సలుపు చున్నట్లుగా, 1835 వ సంవత్సరమున వ్రాసిన యొక లేఖలో పేర్కొనెను. అటుల లక్ష్మయ్య చరిత్ర పరిశోధనమున విరామ మెరుగక పరిశ్రమించుచుండెను. కాని మెకంజీకి పిమ్మట అధి కారమునకు వచ్చిన వా రాతనికి తగినంత ప్రోత్సాహము నొస గక పోవుట మిక్కిలి శోచనీయము.

లక్ష్మయ్యపై మెకంజీ దొరవారికి గల యాదరాభి మానము లెట్టివో ఆయన వీలునామాను పరిశీలించిన ప్రవ్యక్త మగును. ఆ వీలునామాలో లక్ష్మయ్యను గూర్చి మెకంజీ

ప్రశంసించి యుండుట హర్షింపదగు నంశము 1811 వ సంవత్సరము ఆగస్టు 3 న వ్రాయబడిన ఆ వీలునామాలో తన యాస్తిలోని పదియవ భాగము లక్ష్మయ్యకు చేరవలయు నని మెకంజీ సూచించెను. ఆ సందర్భమున ఆయన యిట్లు పేర్కొనెను.

"...to my servant Cavelly V. Lechmiah, Boriah and his younger brother Ramaswamy, ...In some Compensation for the useful services of the said Lechmiah and of his late brother C. Boriah. I desire that my brother, sister and friends, recollecting the value I had for these persons, will by no means attempt to lessen or defeat my intention in this respect, which I wish them to consider sacred and invoilable."

1815 వ సంవత్సరము ఫిబ్రవరి 18 న మరల వ్రాయబడిన మెకంజీ వీలునామాలో కూడ లక్ష్మయ్య ప్రశంస చేయబడెను.

ఈ విషయాదికమును చూడగా లక్ష్మయ్య విశ్వాసపాత్రు డగుభృత్యు డనియు, సత్యశీలు డనియు, బొర్రయ్యవలె మెకంజీ యాదరాభిమానములు గడించినవాడనియు విశద మగుచున్నది. చరిత్ర పరిశోధనమున అతడు ప్రదర్శించిన యభిమానము ప్రశంసాపాత్రము. బొర్రయ్యవంటి ప్రతిభావంతునకు తగిన తమ్ము డని వార్తకెక్కిన వేంకటలక్ష్మయ్య సంస్మరణీయు డనుట సమంజసము.

## వేంకటరామస్వామి

ఆంధ్రుల చరిత్ర పరిశోధనమునకు పునాది వేసిన కావలి సోదరులలో వేంకటరామస్వామియే కడపటివాడు. ఇతనిని గూర్చి మన కెక్కువగా తెలియవచ్చుటలేదు. అంత మాత్రమున రామస్వామి అప్రసిద్ధుడనుట అసమంజసము. అగ్రజులవలె అతడు కూడ చరిత్ర రచనమున కుపకరించు సాధన సామగ్రిని సేకరించినవాడే. కారణ మేమో తెలియదు కాని, మెకంజీ దొరవారికి బొర్రయ్య లక్ష్మయ్యలయందు కలిగి నంత యాదరము రామస్వామియందు కలుగలేదు. అతనిని గూర్చి మెకంజీ ఒకచోట వ్రాయుచు, "As to Ramaswamy his brother, I look upon him in a different light" అనెను.

హైదరాబాదులో సర్వే జరుగుచున్న కాలమునందే రామస్వామి మెకంజీ దొర కొలువులో చేరియుండనోపును. కాని అతడు చాలకాలము జీతము లేకయే పని చేసెను. పిమ్మట 25 వరహాల తక్కువ జీతముమీద అతడు మెకంజీ గుమాస్తాగా నియమితు డైనట్లు తెలియుచున్నది.

రామస్వామి మహాపండితు డనుటకు ఆంగ్లములో అతడు సంతరించిన 'దక్కను కవుల జీవిత చరిత్రలు' (Biographical Sketches of Deccan Poets) అను సుద్గ్రంథమే తార్కాణ. ఆంధ్రకవి చరిత్రకారులలో అతడే ప్రథముడు. బొర్రయ్య జీవిత విశేషాదికమును తొలుదొలుత లోకమునకు తెలియజేసిన వాడు రామస్వామియే. అంతే కాదు, ప్రసిద్ధాంధ్రకవులను

గురించి పాశ్చాత్య ప్రపంచమునకు ప్రవ్యక్త మొనర్చిన వాడు కూడ రామస్వామియే. కనుక అతడు బొర్రయ్య లక్ష్మయ్యల కెంతమాత్రము తీసిపోనివాడని నుడువదగును.

దక్కను కవులచరిత్ర కలకత్తాలో 1829 వ సంవత్సరమున ప్రచురింపబడెను. ముఖపత్రముమీాద ఇట్లు కలదు. 'Cavelly Venkata Ramaswamy, Late Head Translator and Pandit of the Library and Antiquarian Department.' కనుక రామస్వామి గ్రంథాలయమునందును, ప్రాచీనచరిత్ర పరిశోధన శాఖయందును పండితపదవి నలంకరించె నని విదిత మగుచున్నది. దక్కను కవులచరిత్రలో తెలుగు, తమిళము, కన్నడము, మహారాష్ట్రము, సంస్కృతము మున్నగు భాషా కవులను గురించి రామస్వామి ముచ్చటించి యుండుట గమనార్హము. ఈ గ్రంథరాజము అప్పటి గవర్నరుజనరలగు సర్ విల్లియం బెంటింగ్ దొరకు అంకిత మీాయబడెను.

సరస్వతీబాయి అనునామె వ్రాసిన పాకశాస్త్ర మను నొక వచన గ్రంథమును రామస్వామి ఆంగ్లము చేసెననియు (1836), దాని ప్రతి బ్రిటిషు మ్యూజియము గ్రంథాలయమున నున్నదనియు తెలియు చున్నది.

రామస్వామి కొక కళాశాలలో (Madras College) ఉద్యోగము లభించినట్లును, దాని నతడు స్వీకరించక మెకంజీ కొలువునందే యున్నట్లును జాన్ రిడ్డెల్ వ్రాతలవలన విదిత మగుచున్నది. ప్రాచీన దక్కను దేశపటము నొకటి అతడు

ప్రవాసె ననియు, అది 1827 వ సంవత్సరమున కలకత్తాలో ముద్రిత మయ్యె ననియు తెలియుచున్నది.

దక్షిణాపథ చరిత్ర రచనమున కుపకరించు సాధన సంపత్తిని సేకరించుటకే తమ జీవితముల నంకిత మొనర్చిన కావలి సోదరులు చిరస్మరణీయులు. వారి చల్లని చూపులే ఆంధ్రుల చరిత్రకు శ్రీరామరక్ష! ఆ సోదరత్రయమునకు తోడు నీడగా సంచరించిన కర్నల్ కాలిన్ మెకంజీ దొరవారు కూడ చిరస్మరణీయులు!

# బౌద్ధము—ఆంధ్రులు

బౌద్ధమతము వెలుగులోనికి రాకపూర్వము మన దేశములో వైదికమతము బహుళప్రచారములో నుండెను. ఆ నాళ్లలో ఎచ్చట చూచినను యజ్ఞయాగాదిక్రతువు లొనరించు వైదికమతావలంబకులే; హోమధూమములే. కాని కర్మకాండ నానాటికిని ప్రబలిపోయి తుదకు వైదికమతము జనసామాన్యమునకు దూర మయ్యెను. అంతేకాదు. జంతుబలులు కూడ క్రమక్రమముగా వ్యాప్తిలోనికి రాసాగెను. అనగా హింసాకాండకు కూడ మతములో స్థానము కలిగె నన్న మాట!

ఆ కలుషిత వాతావరణమును చూచిన గౌతమబుద్ధుని హృదయము శోకార్ణవ మయ్యెను. అకటా! అపమార్గములో పడిపోయి లోకము దుఃఖ మయ మగుచున్నదే—అని అత డెంతో పరితపించెను. తత్ఫలితమే బౌద్ధమతము. ఈనాడు బౌద్ధము బర్మా, థాయ్‌లాండు, టిబెట్, కంబోడియా, లావోజ్, చైనా, జపాను, సింహళము మున్నగు దేశములందు విశేషవ్యాప్తిలో నున్నది. కాని ఆశ్చర్య మేమనగా పుట్టినిల్లయిన భారతావనిలో మాత్రము బౌద్ధము ప్రచారమును

కోల్పోయెను. అయినను బౌద్ధమత మన్నచో నేటికిని మనకు ప్రగాఢభక్తి ప్రపత్తు లుండుట హర్షింపదగిన విషయము.

బౌద్ధము హింసాకాండను నిరసించును; సర్వమానవ సౌభ్రాత్రమును వాంఛించును; సర్వభూత సమదర్శితను కోరును. బౌద్ధమత మనగానే స్థూలదృష్టికి కూడ ఈ ధర్మములు గోచరింపక పోవు. ఇవికాక మరికొన్ని ముఖ్యధర్మములు కూడ కలవు. వానిని పరిశీలింతము.

లోకము దుఃఖమయము; అజ్ఞానమునకు నిలయము. కావున బుద్ధిమంతులైనవారు తరణోపాయమునకై యత్నింపవలెను. మానవు లెల్లరు జననమరణములకు పాల్పడుచున్నారు. ఈ ప్రపంచములో వా రనేకమారులు పుట్టుచున్నారు; గిట్టుచున్నారు. ఉత్తరజన్మలో కలుగు శుభాశుభములకు హేతువులు ప్రాగ్జన్మలో చేయబడు కర్మలే. సత్కర్మాచరణము వలన సద్గతి ప్రాప్తించును. కనుక ఈ ప్రపంచ బంధములనుండి విముక్తి పొందుటకు విషయవాంఛలకు స్వస్తి చెప్పవలెననుట స్పష్టము.

ఈ ధర్మములు హిందూమతములో కూడ నున్నవే. బుద్ధుడు హైందవ కుటుంబములో పుట్టిపెరిగిన వాడు. అందువలన తన్మతరహస్యము లతనిని వశంవదము చేసికొనినవి. కర్మసిద్ధాంతము, పునర్జన్మ సిద్ధాంతము మొదలగునవి హిందూ బౌద్ధమతములలో కనబడు సామాన్య సిద్ధాంతములు. కాని

ఆత్మానుభవముచే బుద్ధుడు కొన్ని హైందవ ధర్మములను సంస్కరించినాడు.

సత్యాన్వేషణార్థమై సర్వస్వమును పరిత్యజించి అడవులు చేరిన గౌతముడు తపస్సు చేయ నారంభించెను. అన్నపానాదులను విసర్జించెను. ఆకలిదప్పులను విస్మరించెను. అహోరాత్రములుగా ఆరుసంవత్సరములు ఘోరతపస్సు చేసెను. కాని లాభము హుళక్కి అయ్యెను. అతని కేదియు సత్యము గోచరింపలేదు. అంతటితో తపస్సుమీద బుద్ధునికి విరక్తి కలిగెను. ఉపవాసాదులచే దేహమును శుష్కింప జేయుట మనస్సును కూడ శుష్కింపజేయుటయే అని అతడు తలచెను. తపస్సు లాభరహిత మని తలచి నాటినుండియు గౌతముడు మధ్యేమార్గము నవలంబించెను. కేవల భోగమయజీవితమును, కేవల తపస్సంపన్నమైనజీవనమును విడిచి పుచ్చి ఆశాపాశములను త్రెంచుకొని ప్రశాంత వాతావరణములో జీవనము సాగించుటయే శుభోదర్క మని బుద్ధుడు తలచెను. దీనికే మధ్యేమార్గ మని పేరు. హిందూమతము నందలి వర్ణవ్యవస్థకూడ బుద్ధునికి నచ్చలేదు. అందువలన వర్ణ వ్యవస్థలేని మతప్రచారమునకు గౌతముడు పూనుకొనెను. ఆధ్యాత్మిక ప్రపంచములో సర్వమానవులు సమానప్రతిపత్తి కలవారు. హెచ్చుతగ్గులుగాని, కులభేదములుగాని మానవ సంఘము నందుండకూడదు. ఎల్లరును సమానులే యను ఈ నూతన సిద్ధాంతముతో ప్రప్రథమముగా భారతావనిలో బౌద్ధ మతము వర్ణరహిత మైనసంఘమును స్థాపింపగలిగెను.

బుద్ధుని ధర్మ ప్రవచనములను రెండు భాగములుగా వింగడింపవచ్చును. చతురార్య సత్యములు, అష్టాంగ మార్గము—అనునవి ఆ విభాగములు. మానవుని దుఃఖ ప్రాప్తికి గల కారణములు, తన్నివారణోపాయములు మున్నగువానిని ఆ నాలుగు సత్యములు సుగమము చేయుచున్నవి. అష్టాంగమార్గము శాశ్వత సౌఖ్య ప్రసాదియైన నిర్వాణమును సుగమము చేయుచున్నది.

1. సర్వమానవులు దుఃఖము ననుభవించుచున్నారు.
2. దుఃఖప్రాప్తికి కారణము స్వార్థచింతనతోడి దురాశ.
3. ఆశ నశించినగాని దుఃఖము నశింపదు.
4. మధ్యేమార్గము నవలంబించుచో ఆశ నశించును.

వీనికే చతురార్య సత్యము లని పేరు.

మధ్యేమార్గము అష్టాంగ మార్గములో వివరింపబడినది.

ఈ క్రింది వానిని అష్టాంగము లందురు.

1. సమ్యక్ దృష్టి
2. సమ్యక్ సంకల్పము
3. సమ్యక్ స్మృతి
4. సమ్యక్ వాక్కు
5. సమ్యక్ జీవము
6. సమ్యక్ కరణము
7. సమ్యక్ వ్యాయామము
8. సమ్యక్ సమాధి.

సమ్యక్ ప్రవర్తన పంచశీలములందు విశదీకరింపబడినది.

జీవహింస చేయకుండుట, ఇతరుల వస్తువులను కోర కుండుట, పరనారీ సంగమమును వాంఛింపకుండుట, అసత్యమాడ కుండుట, మనోవికారము కలిగించు మద్యపానాదులను సేవింప కుండుట అనునవి పంచశీలములు.

వీనిని నిష్కల్మష హృదయముతో నిర్వర్తించినచో నిర్వాణము సుగమ మగునని బౌద్ధమతావలంబకుల విశ్వాసము. నిర్వాణ ప్రాప్తికి పిమ్మట పునర్జన్మ యుండదు. శాశ్వత మోక్షప్రాప్తి కై ప్రయత్నింపవలయు నని బౌద్ధమత మాదేశించుచున్నది. కాని నిర్వాణము సులభముగా లభ్యమగు నట్టిది కాదు. ఎన్నెన్నో జన్మ లెత్తవలెను. స్వార్థరహితము, సత్కర్మయుతము నైన ప్రశాంత జీవన విధానము నిర్వాణ ప్రాప్తికి దారి తీయును. గౌతమ బుద్ధుడెన్నో జన్మము లెత్తి తుదకు నిర్వాణము నందెను. జాతక కథా సముచ్చయము నుండి మన మీ విషయమును గ్రహింపవచ్చును.

హిందూమతమునందలి విగ్రహారాధనము బౌద్ధమతములో పరిహరింపబడినది. బుద్ధుని దేవునిగా పూజించు సంప్రదాయము బౌద్ధులలో తొలుత లేదు. కాని కాలక్రమమున బుద్ధ విగ్రహము లెన్నో ప్రచారములోనికి వచ్చినవి. అంతటితో ఆగలేదు. వానికి పూజా పురస్కారములు కూడ లభించినవి. కాని హీనయాన బౌద్ధులు మాత్రము దైవ మను భావముతో బుద్ధుని పూజింపరు. జ్ఞానజ్యోతికి చిహ్న మను తలంపుతో వారు బుద్ధుని సేవించుచున్నారు.

సంఘర్షణలకు రంగస్థలమయిన యీ ప్రపంచపు కలుషిత వాతావరణమునకు దూరముగా నుండుమని బౌద్ధమతమాదేశించుచున్నది. అప్పుడుగాని నిజమగు శాంతి మనస్సునకు లభింపదు. కనుకనే బౌద్ధభిక్షుకులు సాధారణముగా ప్రశాంత వాతావరణములో ఏకాంతవాసము చేయుచుందురు. లేదా సంఘారామములలో ప్రశాంత జీవనము సలుపుచుందురు. ఈ బౌద్ధ భిక్షుకులది నిరాడంబర జీవనము; నిష్కల్మష జీవనము. వారికి ఆస్తిపాస్తు లుండకూడదు. ఆహారమును కూడ వారు భైక్షుక వృత్తిచే సంపాదించుకొనవలెను. కాషాయాంబరములు, భిక్షాపాత్ర, ఒకసూది, నూటఎనిమిది పూసలుగల హారము (ధ్యానసమయమునందు బుద్ధనామములను లెక్కించుటకు), క్షురకర్మ కావించుకొనుట కొకకత్తి, నీటిని వడియగట్టుట కుపకరించుపాత్ర—వీనిని మాత్రము భిక్షుకులు తమ యొద్ద నుంచుకొనవచ్చును. వీరు పామరులకు పారలౌకిక క్రియలు నెరవేర్చుకొనుటలోను, మత విషయకమైన విద్యను నేర్పుటలోను సహాయపడుచుందురు. వీనికంటె ముఖ్యముగా పామరజనులకు నిర్వాణ ప్రాప్తికి సోపానమగు ప్రశాంతజీవన విధాన ప్రాశస్త్యమును తెలియజేయవలెను. ఇది భిక్షుకుల విధ్యుక్త ధర్మము. ఈ కారణములచే వారి యెడల బౌద్ధ మతస్థుల కపారమైన భక్తి విశ్వాసములు.

ఈ సందర్భమున బర్మా దేశములోని బౌద్ధమతమును గుఱించి ప్రస్తావించుట అప్రస్తుతము కాదు. ఏలయన నేటికిని

బర్మాలో ఆ బాలగోపాలము బౌద్ధమతము నెడల భక్తి ప్రప త్తులు ప్రకటించుచున్నారు. వీలయినంతవరకు తద్దేశీయులు బౌద్ధ ధర్మములను కార్యరూపములో పెట్టుటకు ప్రయత్నించు చున్నారు. ఇది యెంతేని హర్షింపదగు విషయము.

ఆగర్భశ్రీమంతుడైన గౌతముడు సర్వస్వమును త్యజించి సన్న్యాసము స్వీకరించిన మహద్విషయమును బర్మా దేశీయులు తమ సంతానములకు తెలియజేయు విధానము చూపఱకు సంభ్రమాశ్చర్యములు కలిగించును. నాలుగు సంవ త్సరముల చిన్న వయస్సుననే బాలురీ విషయమును హృద్గ తము చేసికొందురు.

తన సంతానమునకు నాలుగవయేడు వచ్చిన పిమ్మట ఒక సుముహూర్తమున తండ్రి అతనికి విలువగల వలువలు కట్టబెట్టును. వివిధము లగునాభరణములతో అతనిని కైసే యును. ఈ తతంగము శ్రీమంతుడైన బుద్ధుని బాల్య జీవిత మును గ్రహించుటకు తోడ్పడును. అటు పిమ్మట అతనికి కేశ ఖండనము జరుగును. కట్టబెట్టిన యమూల్యాంబరముల నన్నిటిని తీసివేయుదురు. వైభవశ్రీని విసర్జింప సన్నద్ధుడైన బుద్ధుని మానసికావస్థను ప్రదర్శింపజేయుటయే యిందులోని ఆంత ర్యము. తదనంతర మొక వృద్ధు డతని చేతికి భిక్షాపాత్ర నొస గును. బౌద్ధ భిక్షు వతనిని సమీపించి అతనిచేత త్రిరత్న ములు—బుద్ధం శరణం గచ్ఛామి, సంఘం శరణం గచ్ఛామి, ధర్మం శరణం గచ్ఛామి—పలికించి సంఘారామములోనికి

తీసికొనిపోవును. ఇది ముగిసిన పిమ్మట ఆ బుడుతడు కనీస మొక రాత్రి మైనను సంఘారామమునందే నివసింపవలెను. వివాహాది శుభ కార్యములకంటె కూడ ఈ కార్య కలాప మెంతో ముఖ్య మైనదిగా పెద్దలు పిన్నలు భావింతురు.

జపాను దేశమునందు బుద్ధుని జన్మదినోత్సవ సందర్భమున యువకులు, బాలురు నొక మహోత్సవము జరుపుదురు. ఇది కన్నుల పండువు గొలుపుచుండును. ఆనాడు బాలురు రకరకాల రంగులగుడ్డలు ధరింతురు. కాగితముతో చేయబడిన 'వికసిత పద్మములను' చేత పుచ్చుకొని వారందఱు నొక కోవెలలో సమావేశ మగుదురు. ఆ గుడిలో కాగితముతో తయారుచేయబడిన ఒక యేనుగుమీాద బుద్ధుని విగ్రహము నుంచుదురు. ఆ విగ్రహమునకు వారు నమస్కరింతురు. పిమ్మట తీయని తేనీటితో ఆ విగ్రహమున కభిషేకము చేయుదురు. బుద్ధుడు ప్రభవించినప్పుడు తేనీటివాన కురిసె నని జపానువారి విశ్వాసము. కనుకనే ఆనాడు జపాను బాలబాలికలకు తేనీటితో బుద్ధున కభిషేకము చేయుట ఆచార మైనది.

ఇటుల వివిధ దేశములందును బౌద్ధమతము ప్రజాదరమును సముపార్జించుకొనెను.

గౌతమ బుద్ధుడు దయామయుడు; అహింసావాది, శాంతమూర్తి. సత్యవచనుడు. విశ్వశ్రేయస్సునకై సర్వసంగ పరిత్యాగము చేసి సాంద్రాటవీసీమలలో కాలము గడిపిన

కారణజన్ముడు. కన్నీటి గాథలతో జీవితయాత్ర సాగించు కష్ట చరిత్రులకు తరణోపాయము చూపిన దయామయుడు.

సంగ్రహముగా చెప్పవలె నన్నచో ఆ మహా పురుషుడు సకల కల్యాణగుణ సమన్వితుడు. అట్టి మహనీయునిచే స్థాపింప బడిన మతము ప్రజాభిమానమును చూరగొనుటలో ఆశ్చర్యము లేదు!

మన తెలుగు దేశములో సాగర తీరమునందలి యే గ్రామము చూచినను బౌద్ధ క్షేత్రముగా కనబడుచుండు ననుట అత్యుక్తి కాదు. ఆ పల్లె పట్టులలో ముద్దులు మూట గట్టు ముగ్ధమోహన మూర్తులతో కలకలలాడుచు కన్నుల పండువు గొలుపు కమనీయ కళాఖండములు కనబడును. బౌద్ధమతము మహోన్నత దశలో నున్నప్పుడు మన ఆంధ్రావని ప్రముఖ బౌద్ధ క్షేత్రముగా నుండె ననియు, బౌద్ధ భిక్షువులు పలువురు తెలుగు దేశమునకు రాకపోకలు చేయుచుండిరనియు నుడువదగును. కాని మన దురదృష్ట వశమున నేడా క్షేత్రములు పూజా పురస్కారములు లేక బూజుపట్టియున్నవి.

బౌద్ధమత వ్యాప్తివిషయమున ముందంజ వేసినవారు క్షత్రియ కులోద్భవులైన జనపతులు. బుద్ధుడు రాజవంశీయు డగుటచే బౌద్ధము అనాయాసముగా రాజాశ్రయమును సంపాదింప గలిగెను. ఆ దినములలో రాజును బట్టి ప్రజలు మెలగు చుండిరి. రాజానుగ్రహసముపార్జనమే నాటి భారతీయుని

ముఖ్యాశయ మై యుండెను. అందువలన రాజు స్వీకరించిన మతమునే ప్రజలు కూడ స్వీకరించుట పరిపాటి అయ్యెను.

బౌద్ధమత వ్యాపకులలో అశోక సమ్రాట్టునదే ప్రథమ తాంబూలము. అతని నిర్విరామ కృషి ఫలితముగా బౌద్ధము నలుమూలలకు వ్యాపించెను. ఆంధ్ర దేశమున కూడ బౌద్ధము వ్యాప్త మగుటకు కారణభూతుడు మౌర్య భూపతి యనియే చెప్పుదురు. కాని ఆంధ్ర బౌద్ధము మౌర్య సమ్రాట్టునకు పూర్వమే వెలసె ననియు, అశోకుడు ప్రోత్సాహకుడే యనియు సుప్రసిద్ధ చారిత్రక పరిశోధకులు డాక్టర్ సుబ్రహ్మణ్యాన్ గారి విశ్వాసము.

మహా సాంఘిక నేతయగు మహాదేవ భిక్షువు అశోకుని చే ప్రేరితుడై ఆంధ్రావని కేతెంచెను. కృష్ణా నదీ తీరమున నున్న ధాన్యకటకమును కేంద్రముగా చేసికొని అతడు బౌద్ధ మత వ్యాపనములో నిమగ్ను డయ్యెను. తత్ఫలితముగా తెలుగు వారికి బుద్ధ భగవానుని సందేశములు ప్రీతిపాత్రము లయ్యెను; బౌద్ధ గ్రంథములు పారాయణ గ్రంథము లయ్యెను. తెలుగు నాడు బౌద్ధ భిక్షుకులతో కిటకిటలాడ సాగెను. కాలక్రమమున నాగార్జునునికొండ (శ్రీ పర్వతము), అమరావతి, ఘంటసాల, గుడివాడ, జగ్గయ్యపేట, భట్టిప్రోలు మున్నగు స్థలములు ఆంధ్రబౌద్ధులకే కాక యావద్బౌద్ధ లోకమునకే పవిత్ర క్షేత్రము లయ్యెను.

మహాదేవ బౌద్ధాచార్యుడు చైత్యకవాద మనునొక క్రొత్త సంప్రదాయమును స్థాపించెను. ఈ వాదము కూడ బౌద్ధముముక్షువుల యాదరాభిమానములను చూరగొనినది. చైత్యక సంప్రదాయము ననుసరించువారు చైత్యకు లని వ్యవహృతులు కాదొడగిరి. నాటినుండియు ధాన్యకటక మహాచైత్యము తెలుగు సాంఘిక సందోహమునకు ప్రధాన కేంద్రమయ్యెను.

అశోక సమ్రాట్టు మరణముతో బౌద్ధమతమునకు కుడిబుజము పడిపోయి నట్లయ్యెను. కాని తెలుగునాడున మాత్రము మత సహనము గల మహీపతులు రాజ్యము చేయుచుండిన కారణమున బౌద్ధమతస్థు లనేకులకు తెలుగు గడ్డమీద నిలువనీడ లభించెను. బౌద్ధ భిక్షుకులకు విహారములు, సంఘారామములు మొదలగునవి నిర్మితము లయ్యెను.

ఆంధ్రబౌద్ధులను గూర్చిన ప్రసక్తి బౌద్ధ వాఙ్మయమున పలుతావులందు గోచరించుచున్నది. ఆంధ్రులను అంధకులని బౌద్ధులు వ్యవహరించిరి. బౌద్ధుల వేదము లగు త్రిపిటకములకు వ్యాఖ్యానము వ్రాయు సందర్భమున బుద్ధ ఘోషాచార్యులవారు 'అంధక బౌద్ధ సంప్రదాయము' అని పేర్కొని దానిని విపులముగ వివరించినారు. ఆంధ్ర అట్ఠ కథలకు బౌద్ధ సాహిత్య ప్రపంచమునందు విశిష్ట స్థానము గలదు. ఆంధ్ర బౌద్ధుల వలన దక్షిణాపథ బౌద్ధ సంప్రదాయ మనియు, ఉత్తరాపథ సంప్రదాయ మనియు రెండు తెగలు భారతీయ బౌద్ధము

నందు వెలసినవి. దక్షిణాపథ బౌద్ధ సంప్రదాయ మనగా ఆంధ్ర బౌద్ధ సంప్రదాయమే కాని అన్యము కాదని విజ్ఞుల యభిప్రాయము. సింహాళ ద్వీప చరిత్ర కూడ తెలుగు దేశము ప్రముఖ బౌద్ధమత కేంద్ర మని నుడువుచున్నది.

ఈ విషయాదికమును పరిశీలించినచో బౌద్ధ సాహిత్యమునందే కాక మత విషయమునందును ఆంధ్రబౌద్ధులాచార్య పదవిని పొందియుండి రని తెల్లమగును. అట్టి ఆచార్య సత్తములలో నాగార్జునాచార్యుడు, అర్య దేవాచార్యుడు: దిఙ్నాగాచార్యుడు మున్నగు గరీయః ప్రతిభులు పేర్కొనదగినవారు.

ఈనాడు తెలుగునాడున బౌద్ధము సజీవముగా లేకున్నను, అలనాటి ఆంధ్రబౌద్ధులు నిర్మించిన స్తూపములను పురస్కరించుకొని బౌద్ధమతము నెడల తెలుగువారు ప్రదర్శించిన భక్తిప్రపత్తు లెట్టివో మనము తెలిసికొనవచ్చును. ఇవి వట్టి స్తూపములు కావు; ఆంధ్రశిల్పశాస్త్రజ్ఞులు తీర్చిదిద్దిన కమనీయకళాఖండములు. ఈ కళాఖండములవలననే తెలుగు దేశపు పేరుపెంపులు నేల నాలుగుచెరగులందును వ్యాపించెను.

ఇక ఆనాళ్ల లో వేలాది ముముక్షువుల నాకర్షించిన నాగార్జునునికొండ, అమరావతి, గుడివాడ మున్నగు బౌద్ధ క్షేత్రములందు వెలసిన స్తూపములను రేఖామాత్రముగా పరిశీలింతము.

## నాగార్జునునికొండ

నాగార్జునుని కొండ అనగానే ఆర్యనాగార్జునుని పవిత్ర నామము శ్రవోయుగళిలో మారుమ్రోగును; హృదయము భక్తిరసప్లావిత మగును. మాధ్యమకవాద ప్రవర్తకుడు, మహితాత్ముడు. బౌద్ధ విశ్వవిద్యాలయ స్థాపకుడు, బహు గ్రంథకర్త, పరమపూజ్యుడు నగు నాగార్జునాచార్యుడు ప్రత్యక్ష మగును.

నాగార్జునుడు బ్రాహ్మణుడు. దాక్షిణాత్యుడు. ఆంధ్రుడని డాక్టర్ జి. వి. కృష్ణరావుగారి యభిప్రాయము. వేద శాస్త్ర పారంగతుడు. వైద్యవిజ్ఞానము నందును అఖండుడు. అణిమాద్యష్ట సిద్ధులను సాధించిన దిట్ట. ఇది యది అననేల. సర్వశాస్త్రములందును నాగార్జునుడు ప్రవీణుడై యుండెనని చెప్పదగును. వాదోపవాదములకు పాల్పడిన మహాయానము నుద్ధరించియు, అమరావతికి ప్రాకారాదులు పునర్నిర్మించియు, బౌద్ధవిశ్వవిద్యాలయమును స్థాపించియు నాగార్జునుడు చిరయశస్సు సముపార్జించినాడు. అట్టి మహనీయుని పేరుమీదుగ వ్యవహృత మగుచున్న నాగార్జునునికొండ ప్రముఖ బౌద్ధ క్షేత్ర మనుట నిర్వివాదము.

నాగార్జునుని కొండ కృష్ణానదికి దక్షిణతీరమున గుంటూరు మండలము పల్నాడు తాలూకాలో నున్నది. ఇచ్చట కొండలయెత్తు ఎనిమిదివందల అడుగులు. కొండలే కాక పెద్దపెద్ద మట్టిదిబ్బలు కూడ గలవు. ఈ దిబ్బలు బౌద్ధ

నిర్మాణావశేషము లని చెప్పుదురు. నేడీ ప్రదేశ మంతయు పర్వతప్రాంత మగుటచే చెట్టుచేమలుకూడ నిట పెరుగవు; నీరుకూడ లభింపదు.

శ్రీపర్వత నామాంతరము గల నాగార్జునుని కొండ స్తూపము ఇటికతోను సున్నముతోను కట్టబడిన యొక బృహన్నిర్మాణము. ఇది మహాచైత్య మని శాసనములు సాక్ష్యమొసగుచున్నవి. అండాకృతిగల స్తూప మొకవేదికపై కట్టబడి యున్నది. ఈ వేదిక నావరించి పదుమూడడుగుల ప్రదక్షిణ మార్గము కలదు. దీని నావరించి అయిదడుగులయెత్తున ఇటికగోడల ప్రాకార మున్నది. ఈ ప్రాకారమునకు విశాలములైన నాలుగుద్వారములు నాలుగువైపుల నున్నవి. ప్రస్తుతము వీని పునాదులు మాత్రమే గోచరము లగుటచే వీని యాకృతి విశేషము లెట్టివో తెలియవచ్చుటలేదు. కాని యీ నిర్మాణము ధర్మచక్రము నమూనా మీాదనే కట్టబడినట్లు పండితులు నుడువుచున్నారు. ఈ స్తూపమును త్రవ్వునందర్భమున బుద్ధధాతువు నిక్షిప్త మైన మృణ్మయపాత్ర యొకటి లభించెను. అందు బటాణీగింజంత పరిమాణముగల యెముక యుండెను. అదియే బుద్ధధాతువు.

ఇచ్చటి స్తూపము లన్నియు ఇటికతోనే కట్టబడినవి. స్తూపవేదికకు ముందుభాగమున జీవ ముట్టిపడుచున్న చిత్రములు చెక్కిన శిలాఫలకములను పేర్చి సున్నముతో అతికినారు. ఇట్టిఫలకములు రమారమ నూటికి పైగా లభించినవి.

వీనియందు చిత్రితము లైన చిత్తరువు లన్నియు అమరావతీ కళాసంప్రదాయాను గుణముగా చిత్రింపబడినవే! అమరావతి, నాగార్జునునికొండస్తూపముల కళా సంప్రదాయమునకును, జావా (యవన) ద్వీపపు కళాపిధానమునకును దగ్గరిచుట్టరికము కల దని విజ్ఞుల విశ్వాసము.

## అమరావతి

అమరావతి కృష్ణానదీ తీరమున ధాన్య కటకమునకు సమీపమున నున్నది. ఇచ్చట నొకస్తూపము కలదు. దీని నిర్మాణ మెపుడు జరిగెనో యిదమిత్థముగా చరిత్ర కింకను తెలియరాలేదు. స్తూపపుఱాలమీద మౌర్యలిపితో నున్న శాసనములు కొన్ని యుండుటవలన, ఇది మౌర్య వంశ్యుల కాలమున నిర్మింపబడి యుండవచ్చు నని కొందరు తలచుచున్నారు. అంతే కాక స్తూపాకృతిని పురస్కరించుకొని చూడగా ఇది క్రీస్తునకు పూర్వమే వెలసినట్లు స్పష్ట మగుచున్నది.

ప్రాచ్యపాశ్చాత్య పండితుల ప్రశంసల నందుకొన్న అమరావతీ స్తూప నిర్మాణక్రమ మత్యద్భుతము. అందలి శిల్పము మనోమోహనము. ఒక వర్తులా కారపు వేదికపై అర్ధగోళా కృతిగల యండ మొకటి కలదు. దాని మీద హార్మిక యున్నది. దానిపై నికేతనముతోడి దండాంకితచ్ఛత్రము కలదు. కనుకనే యీ నిర్మాణము సంపూర్ణ నిర్మాణ మని శిల్పకళా నిష్ణాతల యభిప్రాయము.

వేదిక పై ఆయక స్తంభములు గలవు. వీని మీద ధర్మచక్ర బోధి వృక్ష చిత్రములు మనోజ్ఞముగా చెక్కబడి యున్నవి. ఆంధ్ర శిల్పాచార్యుల కళా వైదుష్యమునకు శాశ్వత చిహ్నమే ఆయక స్తంభ రచన యని విమర్శకుల విశ్వాసము. ఎందుకనగా తెలుగుగడ్డ మీద వెలసిన స్తూపములందు తప్ప మరియెచ్చటను స్తూపములందు ఆయక స్తంభ నిర్మాణ మున్నట్లు కానరాదు.

వేదిక చుట్టును శ్రీవీథి కలదు. కన్నులకు విందైన గూర్చు కమనీయ చిత్రములతో అది చిత్రితము. మాయా దేవి స్వప్న వృత్తాంతము, గౌతముని జనన వృత్తాంతము, మారప్రలోభము, మహా నిష్క్రమణము మున్నగు బౌద్ధ గాథే తివృత్తములు కన్నులకు కట్టునట్లు స్తూపపు శిలలపై చెక్కబడినవి.

క్రీస్తుశకము మొదటి రెండు శతాబ్దము లందలి తెలుగువారి యాచార వ్యవహారములను, అభరణాదులను తెలిసికొనుట కీ స్తూపమునందలి శిల్పసంపద సహాయపడినట్లు మరియితరములు దోహదములు కావని నుడివినను తప్పు లేదు. ఆంధ్రబౌద్ధుల కళా వైదుష్యమునకు "ప్రత్యక్ష వ్యాఖ్యా నముగా వెలసిన అమరావతీ స్తూపము కళాఖండముగానే కాక ఆంధ్రుల సాంఘిక చరిత్రను ప్రతిబింబించు దర్పణ ముగా గూడ భాసించుచున్నది!

శ్రీ మల్లంపల్లి సోమశేఖర శర్మగారు నుడివినట్లు అమరావతీ స్తూపము "బౌద్ధ యుగమునాటి యాంధ్రులు భక్తి తత్పరులై బుద్ధ భగవానుని కర్పించిన శిల్పనీరాజనము." అంతే కాక "బౌద్ధ యుగమునందలి ఆంధ్ర సంస్కృతికి అమరావతి యపూర్వమణి దర్పణము."

## గుడివాడ

బౌద్ధయుగమునందే కాక హిందూయుగములో గూడ గుడివాడ పేరుపెంపులు గడించిన ప్రసిద్ధక్షేత్రము. ఇది కృష్ణామండలము నందలి మచిలీపట్టణమునకు పశ్చిమోత్తరముగా ఇరువది మైళ్లదూరములో నున్నది. ప్రకృతము గుడివాడ తాలూకాలోనే కాక యా పరిసర ప్రాంతము లందును పెద్దపట్టణములలో నిది యొకటి. ఇచ్చట బౌద్ధస్తూప మొకటి కలదని చరిత్రపరిశోధకుల పరిశోధన ఫలితముగా తెలియ వచ్చినది. కాని యీస్తూపము భూగర్భస్థమై యుండుటచే దీనియాకృతి విశేషములను నిర్ణయించుట కష్టముగా నున్నది. పెద్దదిబ్బగానున్న యీస్తూపమునకు తూర్పునను ఉత్తరమునను గృహములును దక్షిణపశ్చిమ దిశలందు బాటలును, గలవు. అందువలన ఇచ్చట త్రవ్వపని కొనసాగుట కొంచెము శ్రమతో కూడిన కార్యము. 1892 వ సంవత్సరమున త్రవ్వకము కొంతవరకు జరిగి పిమ్మట ఆగిపోయెను. నాటికి నేటికి ఆదిబ్బ దిబ్బగానే యున్నది.

గుడివాడలో వృత్తాకారముగనున్న దిబ్బయొకటి కల దనియు, అది అమరావతీ స్తూపము నమూనామీద నిర్మితమై యుండనోపు ననియు ప్రప్రథమమున 1870 వ సంవత్సరమున మదరాసు ప్రభుత్వమువారికి తెలియజేసిన మహనీయుడు బాస్వెల్ దొరవారు. మరల 1871 వ సంవత్సరమున బాస్వెల్ దొర గుడివాడ దిబ్బవిషయమై మదరాసు ప్రభుత్వమువారికి కొన్ని వివరము లందజేసెను. అటుపిమ్మట ప్రభుత్వమువారు కృష్ణామండలములోని బౌద్ధస్తూపములను సంరక్షించుటకు సముచిత చర్యలు తీసికొనిరి.

గుడివాడ దిబ్బ వృత్తాకారముగ నున్న కారణమును పురస్కరించుకొని స్తూపము కూడ వర్తులాకారముగ నుండ వచ్చు ననియు, భట్టిప్రోలు స్తూపాకృతిని తలపింపవచ్చుననియు పరిశోధకుల విశ్వాసము. ఎఱ్ఱగా కాలిన పెద్దపెద్దఇటుకలతో ఇది నిర్మింపబడినట్లు భావింపబడుచున్నది. నేటికిని వర్షాకాలములో దిబ్బమీది మట్టి తొలగిపోయి స్తూపపు ఇటుకలు, ఇటుక పెంకులు బహిర్గతము లగుచుండును. అప్పుడు ఏవోగీతలు, బొమ్మలుగల ఇటుకపెంకులు కనబడుచుండును. మచిలీపట్టణము విజయవాడల మధ్య రహదారిని నిర్మించిన సందర్భమున ఈ దిబ్బనుండి పెద్దపెద్దఇటుకలు తీయబడినవి! ఒకానొకప్పుడు పరమపవిత్రముగా పరిగణింపబడిన యీ స్తూపము తుదకీ విధముగా నుపయోగపడినది. ఇచ్చట ఒక శిలాపేటిక లభ్యమయ్యె ననియు, అందులో రత్నము, బంగారు రేకు

మున్నగు వస్తువు లుండెననియు స్థలజ్ఞులు స్పష్టమొనర్చినట్లుగా పరిశోధకులు పేర్కొనిరి.

బౌద్ధావశేషములైన యీదిబ్బలకు 'లంజదిబ్బ' లను వ్యవహారనామ మేర్పడినవిషయ మందరకు తెలిసినదే. గుడివాడలోని దిబ్బకు కూడ లంజదిబ్బ యను పే రున్నది. దీనికి సంబంధించిన యొక కథను స్థలజ్ఞు లిట్లు పేర్కొనుచున్నారు.

"పూర్వ మొకవేశ్య యా దిబ్బమీాద స్థిరనివాస మేర్పరుచుకొనెను. ఆమె యేక భుక్తయట! అదికూడ ఆకిరిపల్లి (నూజివీడునకు సమీాపముననున్న గ్రామము) ఆలయ గోపురముయొక్క దీపమును చూచి కాని భుజింపదట. అంత నైతికనిష్ఠ యామెకు. ఆ దిబ్బమీాదనే ఆమె చాలకాలము నివసించినకారణము వలన కాలక్రమమున ఆ దిబ్బను లంజదిబ్బ యని వ్యవహరింపసాగిరి."

పిమ్మట 1878వ సం॥ న సుప్రసిద్ధచరిత్ర పరిశోధకుడు, చిరస్మరణీయుడు నగు సీవెల్ దొరవారు గుడివాడ దిబ్బను సందర్శించి యది సాంచీస్తూపమువలె కనబడుచున్నదని నుడివిరి. కాని సాంచీస్తూప చిహ్నము లేవియు కానవచ్చుట లేదని మఱియొకరు పేర్కొనిరి. మొత్తముమీాద ఈస్తూపము చాలప్రాచీన మైనదని చెప్పవచ్చును.

గుడివాడకు పశ్చిమముగా లామపాడు దిబ్బ అను నొక దిబ్బ యున్నది. ఆప్రాంతమున పూర్వము తొంబది తొమ్మిది గుడులు, చెరువులు నున్నట్లు చెప్పుదురు. అచ్చట ఆంధ్ర

సాతవాహన భూపతులు వేయించిన సీసమునాణెములు దొరకి నవి. వానిని సీవెల్ దొరగారు పరిశీలించి పై యభిప్రాయమును వెలిబుచ్చిరి. కొన్ని నాణెముల మీద గోతమీపుత్ర (గౌతమీ పుత్ర), సిరి (శ్రీ), సతకణి (శాతకర్ణి), వాసిష్ఠీపుత్ర మున్నగు మహీపతుల నామము లున్నవి. చైత్యము, సింహము, నాగ సర్పము, అర్ధ చంద్రుడు, గుఱ్ఱము — మొదలగు బొమ్మలు కూడ వానిపై చెక్కబడినవి. ఇంకొకవిశేష మేమనగా సీవెల్ దొర వారి కొకరోమను నాణెము కూడ లభ్య మయ్యెనట ! దీనిని బట్టి చూడగా గుడివాడ పురాతన పట్టణ మనియు, విదేశము లతో గూడ వర్తకవాణిజ్యములు సాగించిన ప్రసిద్ధవాణిజ్య కేంద్ర మనియు నుడువదగును. ఈనాణెములేకాక మూడు లేక నాలుగడుగుల వ్యాసముగల పెద్దకుండలు, ఎముకలకవచ ములు, కొన్ని ఆభరణములు మున్నగునవి లభించినవి. గుడి వాడలోని హిందూదేవాలయ మైన భీమేశ్వర స్వామివారి కోవెలలో జైనవిగ్రహ మొకటి దొరికెను. అది జైనవిగ్ర హము కా దనియు, మునేశ్వరస్వామివారి విగ్రహ మనియు నుడువుదురు.

భీమేశ్వరస్వామి వారి ప్రశంస చేయబడినది కావున, ఆ దేవుని ప్రస్తుతించుచు మాడయ్యకవి చెప్పిన పద్యము నిట నుదాహరించుట సమంజస మని తలచుచున్నాను.

"వలనుగ నాత్మలోన గుడివాడ
పురాధిపు భీమలింగనిం
దలఁచి, కరంబు లెత్తి ప్రముదంబున
మ్రొక్కి నుతించి, భక్తి ని
శ్చలమతి నివ్వటూరి పుర శాసను
మద్గురు మల్లికార్జునిన్
గొలిచి తదాజ్ఞ చేఁ బ్రకట
కోమల కావ్య కళావివేకి నై"

ఈపద్యము మైరావణ చరిత్రము నందలిది. గుడివాడ భీమేశ్వరు డతిమహిమాన్వితు డని ప్రతీతి!

గుడివాడకు గృధ్ర (గ్రద్ద) వాడ అను నామాంతర మున్నది. ఈపేరు ఎట్లు వచ్చెనో తెలియవచ్చుట లేదు. కాని గుడివాడ పేరువిషయ మై ఊహాగానము చెయ్యవచ్చును. గుడులు మిక్కిలిగా నుండుటచే గుడులవాడ, గుళ్లవాడ అను వ్యవహారనామములు కలిగి తుదకు గుడివాడ అనుపేరు స్థిరమైపోయి యుండును.

ఉపసంహారమున బౌద్ధమతమునందును, బౌద్ధవాఙ్మయ మునందును తెలుగు వా రాచార్యపదవి నలంకరించి సహృదయుల యాదరాభిమానములను చూరగొనియుండిరి. ఇక ఆంధ్ర శిల్పాచార్యులు సృష్టించిన కళాఖండములా వర్ణనాతీతములు. ఆర్యనాగార్జునాచార్యుని గ్రంథరాజములు ప్రచారమున నున్నంతవరకును, అమరావతీ స్తూపము నిలిచియున్నంతవరకును ఆంధ్రబౌద్ధులను మరచిపోద మన్నను మరవలేము.

# సంపదలకొటారము తంజపురము

పూర్వము దక్షిణభారతమున మూడు తమిళరాజ్యములు వర్ధిల్లెను. వానిని చేర, చోళ, పాండ్య లనురాజవంశీయులు పరిపాలించిరి. కనుకనే అవి చేరచోళ పాండ్య రాజ్యము లని ప్రసిద్ధికెక్కెను. ఈ రాజ్యములను మనచరిత్రకారులు తమిళరాజ్యత్రయ మని వ్యవహరింతురు. ఈ తమిళరాజుల యేలుబడిలో తమిళనాడు మూడుపువ్వు లారుకాయలుగా విలసిల్లెను. తమిళభాషా వాఙ్మయములను పోషించియు, గుళ్లుగోపురములు నిర్మించియు ఈ తమిళభూపతులు శాశ్వతయశస్సు సముపార్జించిరి.

తమిళ రాజ్యత్రయములో పేర్కొనదగినది చోళసామ్రాజ్యము. ఆదినుండియు చోళదేశము సిరిసంపదలకు పెట్టినది పేరు. రాజమహాళియు, దాక్షిణ్యశాలియు నగు కరికాల చోళుడు మున్నగు మహీపతులు తొలుదొలుత చోళదేశము నేలిరి. ఆనాళ్లలో మొదట ఒరయూరు, పిమ్మట కావేరిపూంపట్టణము చోళసామ్రాజ్యమునకు ముఖ్యపట్టణములుగా నుండెను. తరువాతికాలమున తంజావూరు రాజధాని అయ్యెను.

తంజావూరు కావేరినదియొడ్డున నున్న పట్టణము. పౌరాణికముగాను, చారిత్రకముగాను తుదలేని పేరుపెంపులు గడించిన పట్టణ మిది.

తంజావూ రనుసరికి మన స్మృతిపథమున బృహదీశ్వ రాలయము తళుక్కు మనును. బృహదీశ్వరాలయ మనగా పెద్దగుడి యని అర్థము. నిజముగానే యిది పెద్దగుడి! దీనికి రాజరాజేశ్వరాలయ మనునామాంతరము కూడ నున్నది. ఈ గుడి చుట్టు నొక పెద్దయగడ్త కలదు. ఇది చోళరాజులకాల మున త్రవ్వబడిన దని చెప్పుదురు.

ఆలయమున నున్న శివుని విగ్రహము చాల పెద్దది. అందువలననే యీదేవునికి బృహదీశ్వరు డనుపేరు కలిగెను. అమ్మవారిపేరు బృహన్నాయకి. మరియొక విశేషము కూడ కలదు. బృహదీశ్వరుని కభిముఖముగా నున్న నందీశ్వరుని విగ్రహము కూడ చాల పెద్దది. అంతపెద్ద నందిని మరియొక గుడిలో మనము చూడబోము. ఎత్తులోనేకాక అందచం దము లందును బృహదీశ్వరాలయములోని నందీశ్వరునికి ఆ నందీశ్వరుడే సాటి. ఇక గుడిగోపురమా మహోన్నత మయి నది. మెడను బాగుగా పైకెత్తి చూచినగాని అది చక్కగా కనబడదు. అంత యెత్తయిన గోపుర మది. గోపురముమీద జీవ ముట్టిపడు చిత్తరువు లెన్నో చోటు చేసికొని చూపరుల నాకర్షించుచుండును.

కళారాధకు లగు చోళభూపతులనాటి శిల్పసంపదను కండ్లకు కట్టునట్లుగా తెలియజేయుచున్న యీ బృహదీశ్వరాలయమును వినిర్మించిన మహనీయుడు రెండవ రాజరాజ చోళుడు. ఈకారణమున ఈ కోవెలకు రాజరాజేశ్వరాలయమను పేరు వచ్చెను. క్రీస్తుశకము 1004లో ప్రారంభ మయిన యీ యాలయ నిర్మాణము 1010 లో పూర్తి అయ్యెను. అనగా అంతపెద్ద గుడిని రెండవ రాజరాజు ఆరుసంవత్సరములలో కట్టించె నన్నమాట!

రెండవ రాజరాజచోళుడు చోళమహీపతు లందరిలోను చాల గొప్పవాడు. అతడు కావించిన జైత్ర యాత్రలు ప్రసిద్ధములు. గొప్పశివభక్తుడు. అతని కాలముననే బృహదీశ్వరాలయమున అరువది ముగ్గురు నాయన్మారుల (శివభక్తుల) విగ్రహములు ప్రతిష్ఠింపబడెను. తమిళనాడులో తరువాతికాలమున వెలసిన యాలయము లీ బృహదీశ్వరాలయము ననుసరించి నిర్మింపబడెను. రెండవరాజరాజు శివభక్తుడైనను, అతడు మతసహనము గలమన్నీడు! నాగపట్టణమున నున్న బౌద్ధవిహారమును నిర్మించుట కతడు బహుధా తోడ్పడె నట.

రెండవ రాజరాజునకు పిమ్మట రాజేంద్ర చోళుడు మొదలగువారు చోళసామ్రాజ్యము నేలిరి. కాని పదుమూడవ శతాబ్దమున చోళులు బలహీను లయిరి. తత్ఫలితముగా చోళరాజ్యము పతనస్థితికి పాల్పడెను. మధురను పరిపాలించు

పాండ్యరాజులు కూడ చోళులవలె ప్రాభవశూన్యు లయిరి. ఆ నాళ్ళలో దక్షిణాపథమున బలవంతు లగుభూపతులు లేక పోవుటచే మహమ్మదీయులు దక్షిణభారతమును తమవశము చేసికొని పరిపాలింప జొచ్చిరి. కాని కలకాలము పడినగోడలు పడినట్లే యుండవు. మానవుని మనుగడయందే కాక రాజ్యములచరిత్ర యందును వృద్ధిక్షయములు సాధారణముగా సంభవించుచుండును. పదునాలుగవ శతాబ్దమున మరల శక్తివంతమగు హిందూరాజ్య మొకటి యేర్పడెను. దానిని స్థాపించిన వారు పరాక్రమోపేతు లగుమన తెలుగుజోదులు. క్రొత్తగా నేర్పడిన ఆ రాజ్యము విజయనగరసామ్రాజ్యము.

విజయనగరాధీశ్వరులు దక్షిణాపథమును కైవసము కావించుకొని పరిపాలింప దొడగిరి. కాగా తంజావూరు, మధుర మొదలగు పట్టణము లెన్నియో వారి యేలుబడి లోనికి వచ్చెను. నాటి నుండియు చోళదేశము విజయ నగర సామ్రాజ్యమున అంతర్భాగ మయ్యెను.

క్రొత్తగా సంక్రమించిన ఆయా రాజ్యములందు సుస్థిర మగుప్రభుత్వము నెలకొల్పుటకుగాను విజయనగరా ధీశ్వరులు తమ బంధువులను, సామంతులను పరిపాలకులుగా నియమించిరి. వీరినే చరిత్రకారులు నాయకరాజు లని వ్యవ హరింతురు. తంజావూరు నేలినవారు తంజావూరు నాయక రాజు లనియు, మధుర నేలినవారు మధుర నాయక రాజు లనియు ప్రసిద్ధి వహించిరి. ఈ నాయకరాజు లెల్లరు తెలుగువారు ; బలసంపన్నులు ; వదాన్యశేఖరులు.

నాయకరాజులు తంజావూరు మధుర మొదలగు రాజ్యములకు తరలి పోవునప్పుడు తమతోపాటు ఎన్నో తెలుగు కుటుంబములను కూడ తీసికొని వెళ్లిరి. అటుల తెలుగు మాగాణము నుండి వెళ్లినవారిలో అన్నివర్ణముల వారు నుండిరి. పండితులు, కవులు, పురోహితులు, గాయనీ గాయకులు, శిల్పశాస్త్రజ్ఞులు, నట్టువకత్తెలు – ఎందరెందరో తమిళ దేశమునకు తరలి పోయిరి. నాయకరాజులవలె ఆ తెలుగు కవులు, ఆ తెలుగు గాయకులు మున్నగువారు మధుర తంజాపురాది ప్రాంతములలో స్థిరనివాసము లేర్ప రుచుకొనిరి. ఈ కారణమున నేటికిని తమిళ నాడులో తెలుగు మాటలాడు కుటుంబము లెన్నియో కానవచ్చు చున్నవి. జనాభా లెక్కలను చూడగా తమిళ దేశము నందు రమారమి యిరువది లక్షల తెలుగు వారున్నట్లుగా తెలియుచున్నది. వీ రెల్లరు ఆనాడు నాయక రాజులతో పాటు తరలి పోయిన తెలుగువారి సంతతికి చెందిన వారనుట సుస్పష్టము. నేడు వీరి వేషభాషలలోను, ఆచారవ్యవ హారములలోను మార్పులు కొన్ని గోచరించుచున్నను, దక్షిణాంధ్రులను గౌరవించుట తెలుగువారి కర్తవ్యము.

ఇక తెలుగు రాజుల దొరతనములో తంజావూరి సౌభాగ్యమును పరిశీలింతము.

తంజావూరు నేలిన నాయక రాజులలో ప్రథముడు చెవ్వప్ప నాయకుడు (1532–1560). అతడు మన్నారు

కోయిలలోని రాజగోపాలస్వామివారి భక్తుడు. దాన ధర్మము లెన్నో కావించిన దాన వినోదుడు. ఇతర మతముల నాదరించిన యిద్ధహృదయుడు. తంజావూరి రాచనగరులో సంగీత మహాలును సంతరించిన సరసుడు. ఆ సంగీత మహాలులో పూర్వము గొప్పగొప్ప గాయకులు తమ పాండిత్యమును ప్రదర్శించు చుండిరట. తంజావూరు పట్టణమునకు వెలుపల చెవ్వప్పనాయకు డొక పెద్ద చెరువును త్రవ్వించి ప్రజకు మహోపకార మొనర్చెను. దానిని నేటికిని 'చెవ్వప్ప నాయనిగుంట' అని స్థలజ్ఞులు వ్యవహరింతురు. చెవ్వప్ప నాయనింవారి వంశీయులే తంజావూరును దాదాపు నూట నలుబది సంవత్సరములు పరిపాలించిరి.

తంజావూరు నాయక రాజులలో సంస్మరింపదగినవారు రఘునాథ నాయకుడు, నతని కుమారు డగువిజయ రాఘవ నాయకుడును.

సాహిత్య సమరాంగణ సార్వభౌము డగుశ్రీ కృష్ణదేవ రాయలవారే తంజావూరి రఘునాథ నాయకుడై మరల భూమి మీద నవతరించె నని మన పెద్దలు చెప్పుదురు. అంత గొప్పవాడు రఘునాథ నాయకుడు! అతని కాలమున తంజావూరు సంగీత సాహిత్యములందు వార్త కెక్కెను. కవిపండితులకును, గాయనీగాయకులకును, శిల్పాచార్యులకును తంజపురము పుట్టినిల్లయ్యెను. రఘునాథ నాయకుని కొలువు కూటములో కవయిత్రులు పలువురు విలసిల్లిరి. మనభాషలో కవిత

లల్లిన వనితలను వ్రేళ్ళమీద చెప్ప వచ్చును. రఘునాథ నాయకుని కాలములో ఆ లోటు తీరి పోయినది. ఇతరులచేత గ్రంథములు వ్రాయించి అంకితము పొందుటయే కాక, రఘునాథ నాయకుడు తెనుగున వాల్మీకి చరిత్రము, అచ్యుతాభ్యుదయము నను కావ్యములు వెలయించి చరితార్థుడయ్యెను.

రఘునాథ నాయకునికి పిమ్మట విజయరాఘవనాయకుడు సింహాపీఠి నలంకరించెను. తండ్రివలె నతడును పండిత పక్షపాతి. కళోపాసకుడు. రఘునాథాభ్యుదయ మను నుద్గ్రంథమును రచియించెను. ఈ కావ్యమున రఘునాథ నాయకుని జీవిత విశేషాదికము మనోజ్ఞముగ వివరింపబడినది.

విజయరాఘవనాయకుడు శ్రీ రంగనాథ స్వామివారి భక్తుడు. ప్రతిదినము నిద్రనుండి మేల్కొనిన తోడనే శ్రీరంగమున నున్న రంగనాథుని గుడిగోపురమును సందర్శించుచుండెడివాడు. అటుపిమ్మటనే రాచకార్యములు. ఆ యాలయ గోపురమును సందర్శించు నిమిత్తమై విజయరాఘవ నాయకుడు తన యంతఃపురమునందు పంద్రెండంతస్థులుగల యొక పెద్ద మేడను కట్టించెను. ఆ మేడ నెక్కి ఆ మహారాజు రంగనాథుని గుడి గోపురమును సందర్శించుచుండెనట! ప్రస్తుత మా మేడలో ఆ రంతస్థులు మాత్రమే మిగిలియున్నవి. ఆ రంతస్థులు కూలి పోయెను.

తంజావూరి రాచనగరులోని పెక్కు కట్టడములు విజయరాఘవ నాయకుని కాలమున వెలసినవే. అంతఃపురము నకు ప్రాకారములు నిర్మించినవాడు కూడ నతడే. మా యూరములోని పుష్య మంటపమును, తిరువిడైమరుదూరు లోని మంటపమును కట్టించినవాడు నాతడే. మన్నారుగుడి రాజగోపాలుని గుడికి ప్రాకారాదులు కూడ నిర్మించెను. విజయరాఘవుని తామ్ర విగ్రహ మొకటి తంజావూరు కళా మందిరములో భద్రము చేయబడినది. శిరసున నొక చిన్ని కుల్లాయి ధరించి, ముకుళితహస్తుడై, శాంతమూర్తిగా దర్శన మిచ్చుచున్నట్లుగా ఈ విగ్రహము నిర్మింపబడినది.

విజయరాఘవ నాయకుని యాస్థానకవి యగు కామరుసు వేంకటపతి సోమయాజి తన విజయరాఘవ చంద్రికావిహార మను కావ్యమున కావించిన చోళదేశవర్ణన మత్యద్భుతము. మన తెలుగుదొరల యేలుబడిలో తంజావూరు అందాలు దిద్దుకొన్న తెరగును పరిశీలింతము :

''కవు లెంతురు చోళదేశము, దివ్య
కావేరీవారి ప్రకాశము;
నవరత్నము లున్నకోశము, సుర
నాయక రాజ్య సంకాశము ;
చెఱకు రాజనంపుబైరులు, కాపు
సేమము గలిగిన యూరులు;
తిరముగా బ్రవహించు నేఱులు, చోళ
దేశంబున వెయ్యాఱులు.

ఆ రాజ్యరమకు మంజీరము, అల్ల
    అమరావతికన్న సారము,
భూరమణీమణిహారము, తంజ
    పురము సంపదల కొటారము.
నవరత్నంబుల పేటలు, దివ్య
    నారికేళంబుల తోటలు,
సవరణ సేసిన కోటలు, పీట
    సరసులు నూటాఱు కోటులు.
వలరాయని మీది యేలలు, చాల
    వర్ణింప నేర్చిన బాలలు
విలసిల్లు నాటకశాలలు, అందు
    వింత వింతలు కృష్ణలీలలు.
పరులను గెల్చిన పౌజులు, మెచ్చ
    పాలింతురు దినరాజులు
సరిలేని విద్యాభోజులు, పీట
    సడిసన్న రాజాధిరాజులు.''

విజయరాఘవ నాయకుని కాలమున తంజపురము భూరమణీమణిహార మై, సంపదలకొటార మై విలసిల్లె నట! కాని ఆమహానీయుని కాలమునందే తంజావూరిపై తెలుగు వారి దొరతనమునకు విఘ్న మేర్పడెను.

విజయరాఘవ నాయకుడు తంజావూరు నేలుచున్న సమయమున మధురను చొక్కనాథనాయకుడు పాలించు

చుండెను. ఆదినుండియు మధుర తంజాపుర నాయకరాజుల నడుమ స్నేహభావము మచ్చునకైనను లేకుండెను. తరుణము చిక్కిన చాలు, ఒకరిపై నొకరు కసి తీర్చుకొనుటకు యత్నించుచుండిరి; కయ్యమునకు కాలు ద్రవ్వుచుండిరి. అట్టి తరుణము 1673 వ సంవత్సరమున లభించెను.

విజయరాఘవ నాయకుని కుమార్తెను పరిణయమాడ దలచి చొక్కనాథనాయకు డతనితో రాయబారము సలిపెను. కాని విజయరాఘవనాయకు డందులకు సమ్మతింప లేదు. తుదకు యుద్ధము తప్పనిసరి అయ్యెను. చొక్కనాథ నాయకుని సేనలు తంజావూరి దుర్గమును ముట్టడించెను. అప్పుడు కూడ విజయరాఘవ నాయకుడు తనమనసును మార్చుకొనలేదు. పై పెచ్చు తనకుమారు డగు మన్నారుదాసుతో కూడి అతడు మధురరాజ్యాధి నేతతో యుద్ధమునకు దిగెను. ఆ ఘోర సంగ్రామమున తండ్రి కొడుకు లిరువురును వీరస్వర్గము నలంకరించిరి. రాణివాసమున నున్న రమణీమణులును ప్రాణత్యాగము కావించిరి. విజయరాఘవ నాయకుని మరణముతో కలకలలాడు తంజావూరి రాచనగరు వెలవెల బోయెను.

తంజావూరు చొక్కనాథనాయకుని వశ మయ్యెను. కాని ఒక్కసంవత్సర మయ్యెనో లేదో అంతలోనే తంజావూరు మహారాష్ట్రుల హస్తగత మయ్యెను. మహారాష్ట్రులు తంజావూరును 180 సంవత్సరములు పరిపాలించిరి. నాయకరాజులవలె వారుకూడ ఆంధ్రగీర్వాణకవుల నాదరించిరి.

మహారాష్ట్ర రాజులలో శరభోజీ మహారాజు చాల విశిష్టుడు. అతడు భారతీయభాషలనేకాక ఐరోపీయభాషలను కూడ నేర్చిన భాషాభిమాని. రాజ్యభారమును ఆంగ్లేయుల పరము చేసి తన యావజ్జీవితమును విజ్ఞానసముపార్జనమునకే వినియోగించిన విజ్ఞానఖని. పండిత ప్రవరులచేత వైద్యము, సంగీతము, విజ్ఞాన శాస్త్రము మున్నగువానిని గురించి గ్రంథములు వ్రాయించిన సాహిత్యపోషకుడు. స్వయముగా ఉత్తమగ్రంథములు రచియించిన విద్వాంసుడు. తంజావూరిలో ప్రప్రథమమున ముద్రణ యంత్రమును నెలకొల్పి గ్రంథప్రచురణ కావించిన పురోగామి. ప్రాచ్యపాశ్చాత్య విజ్ఞాననిలయ మనదగు సరస్వతీమహాలను పుస్తక భాండాగారమునకు . జీవము పోసి తరతరములవారికి విజ్ఞానధనము నొసగుచున్న మహా వితరణి.

సరస్వతీమహాలు పుస్తక భాండాగారమున సంస్కృతము, తెలుగు, తమిళము, మహారాష్ట్రము మున్నగు భాషలలో రచింపబడిన యుద్గ్రంథము లెన్నియో కలవు. ఐరోపీయ భాషలలో విరచింపబడిన యమూల్య గ్రంథములు నందు గలవు. సరస్వతీ మహాలున ఏయేగ్రంథము లున్నవో యని చెప్పుటకంటె అచ్చట లేనిగ్రంథము లివ్వి యని చెప్పుట సులభము. ఈ మహాలునందలి గ్రంథముల సంఖ్యను, వైవిధ్యమును పురస్కరించుకొని చూచినచో సరస్వతీమహాలు వంటి ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారము భారతావని యందే కాదు ప్రపంచము నందును మరెచ్చటను లేదనుట అతిశయోక్తి కాజాలదు. ఈ మహద్భాగ్యము తంజావూరికి

లభించినది. అట్టి పుస్తకభాండాగారము నభివృద్ధి చేయుటకే జీవితమును మీదుకట్టిన మహితయశస్సు శరభోజీ మహారాజునకు దక్కినది. కనుకనే ఈ పుస్తకభాండాగారము 'తంజావూరు మహారాజా శరభోజీ సరస్వతీమహాలు' అని ఆదరపురస్సరముగా నేడు పిలువబడుచున్నది. సరస్వతీమహాలు నిర్మాణము నాయకరాజుల కాలములోనే జరిగెనని పేర్కొనదగును. కాని సరస్వతీమహ లనుపేరు మహారాష్ట్రులకాలమున ప్రచారమునకు వచ్చెను.

శరభోజిని గురించి రుచికరము లగు కథ లెన్నో వ్యవహారమున నున్నవి. వ్రాతప్రతులను సంపాదించుటలో ఆ మహారాజునకు కొండంత యభిలాష యుండెనని సువిదిత మగుచున్నది. లేకున్న సర్వతీమహాలు నం దన్ని వ్రాతప్రతులెట్లు చోటు చేసికొనగలవు? ఈ చిన్నికథను పరికింపుడు :

ఒకప్పుడు శరభోజీ మహారాజు పనియొత్తిడిలో నుండెనట. అప్పు డతనియొద్ద ధనముకూడ చాల తక్కువగ నుండెనట. అట్టి సమయమున దూరదేశమునుండి యేతెంచిన పండితు డొకడు శరభోజిని సందర్శించెను. ఆ పండితుని యొద్ద వ్రాతప్రతు లుండెను. వానిని చూచినదే తడవుగా ఆ మహారాజునకు తన యొద్ద తగినంత ధనము లేదను విషయము జ్ఞప్తికి వచ్చెను. తోడనే ముందు వెనుకలు చూడకయే శరభోజీ మహారాజు తన మెడలోని హారమును

తీసివైచి దాని నొసగి పండితుని యొద్ద నున్న యాత్రావాత ప్రతులను గైకొనెను.

శరభోజీ మహారాజు కావించిన సాహిత్యసేవను చూచి ఆశ్చర్యచకితు లయిన యాంగ్ల ప్రభుత్వోద్యోగు లా మహారాజున కొక శిలా విగ్రహమును నెలకొల్ప నభిలషించిరి. వారు తమ యభిలాషను శరభోజికి తెలియ జేసిరి. అందుల కతడు సమ్మతించెను. కాని యిట్లనెనట. "ముకుళిత హస్తు డనై సరస్వతిని సతతము ప్రార్థించిన విన్యాసములోనే నా విగ్రహమును తయారు చేయుడు." అటులనే ఆ మహనీయుని చలువ రాతి విగ్రహము సరస్వతీ మహలున కభిముఖముగా వెలసెను.

తంజావూరి యంతఃపురములోని మరొక మందిరము కూడ నిట సంభావింపదగినది. అది నేడు కళామందిర మని పిలువబడు చున్నది. కళామందిరము నిజముగానే కళామంది రము. తంజపురము నందును తత్పరిసరప్రాంతము లందును లభించిన తామ్ర విగ్రహములు, శిలా విగ్రహములు మున్న గునవి యీ కళామందిరమున భద్రము చేయబడినవి. మన ప్రాచీన శిల్పశాస్త్రజ్ఞుల ప్రతిభను తెలిసికొనుట కీ కళాఖండ ములు మిక్కిలిగా తోడ్పడ గలవు. ఆయా విగ్రహములను చూచుచున్నప్పుడు వానియందు మనకు భక్తి భావము కుదురును. బ్రహ్మ, నర్తన వినాయకుడు, వీణాధర దక్షిణా మూర్తి, శివపార్వతి, భిక్షాటనుడు, నటరాజు, నారాయణి

మొదలైన దేవతా విగ్రహము లెన్నెన్నో యున్నవి. ఇవి కాక సుప్రసిద్ధ చిత్రకారులు వ్రాసిన త్యాగయ్య, ముత్తుస్వామి దీక్షితులు, తమిళ రామాయణకర్త యగు కంబకవి మొదలగు మహనీయుల చిత్రపటములు కూడ నున్నవి. ఈ కళామందిరము, సరస్వతీ మహలు, సంగీత మహలు – ఇవి యన్నియు తంజావూరి రాచనగరునకు అమూల్య భూషణములుగా ప్రతిభాసించుచున్న వని నుడువనగును.

మహారాష్ట్రులు బలహీను లయిన పిమ్మట, అనగా క్రీ. శ. 1855 వ సంవత్సరమున, తంజావూరు తెల్లదొరల పరిపాలనలోనికి వచ్చెను.

మహారాష్ట్రులు కూడ తెలుగు భాషావాఙ్మయములను పోషించుట హర్షింపదగు నంశము. ఈ విషయమును బట్టి చూచినగా, ఆనాళ్లలో భాషాద్వేషము లవలేశ మయినను లేదని స్పష్టమగుచున్నది. అంతేకాక తెలుగుభాష నభ్యసించుటయు, తెలుగున కమ్మనికవితలు వెలయించుటయు, తెలుగు కవులను ఆదరించుటయు ఆనాటిదొరలకు పరిపాటిగా నుండెనని నుడువదగును. వారి భాషాభిమానము కొండాడదగినది. వారు తెలుగు భాషాసాహిత్యములకు కావించిన సేవ చిరస్మరణీయము!

సరస్వతీమహలు పుస్తక భాండాగారము నెడల మహారాష్ట్రులు ప్రదర్శించిన యాదరాభిమానములు గూడ ప్రశం

సింప దగినవి. శరభోజి కుమారుడగు శివాజి 1849 వ సంవత్సరమునందు ఒక్క సరస్వతీమహలు కొరకు 21,589 రూప్యములు వినియోగించెనట! మహారాష్ట్రుల సాహిత్యాభిరుచిని తెలిసికొనుటకీ యొక్క విషయమే చాలును.

చోళరాజులును, నాయక రాజులును, మహారాష్ట్ర రాజులును పరిపాలించిన తంజావూరు చారిత్రక ప్రసిద్ధిగన్న పట్టణ మనక తప్పదు. అమూల్యము లగు గ్రంథములును, అందములు చిందు శిల్పములును నెలకొన్న తంజావూరు నిజముగానే సంపదల కొటారము. కామర్సు వేంకటపతి సోమయాజి పేర్కొనినట్లు తంజావూరు "చోళరాజ్యరమకు మంజీరము; భూరమణీ మణిహారము."

# మధుర నేలిన తెలుగురాణి

మన దేశమునందు రాజ్యము చేసిన రమణీమణులు పలువురు కలరు. స్వయముగా రణరంగమునకు వెడలి, సమరము సాగించి, విజయము సాధించిన బాహుబల సంపన్నలును వారిలో కొందరు లేకపోలేదు. కాని అపూర్వ మగు రాజనీతిని ప్రదర్శించి రాజ్యము నం దెల్లెడల శాంతిభద్రతలు సుస్థిరముగ నెలకొల్పి శాశ్వతయశస్సు సముపార్జించిన రాజనీతి విశారదలు మాత్రము చాలమంది లేరు. ఆ కోవకు చెందిన వారిలో మధుర నేలిన మహారాణి మంగమ్మ యొకతె.

నేటికిని దక్షిణాపథమునందు రాణి మంగమ్మ పేరు మారు మ్రోగుచునే యున్నది. ఆమె నిర్మించిన సత్రములు, కట్టించినభవనములు, త్రవ్వించిన తటాకకూపములు, చేసిన దానధర్మములు మున్నగునవి ఆ మహారాణి పేరు పెంపులను దేశ దేశములందును వ్యాపింపజేయుచున్న శాశ్వత యశశ్చంద్రికలు.

క్లిష్ట పరిస్థితులలో మంగమ్మ రాజ్యమునకు వచ్చెను. ఆనాటి రాజకీయ వాతావరణము అప్రశాంతముగ నుండెను.

అయినను ధైర్యము వీడక, ఆ విషమ పరిస్థితుల నెదుర్కొని రాజ్యమును శత్రువుల బారినుండి సంరక్షించి మంగమ్మ ప్రజకు శాంతిసౌఖ్యములు కల్పించెను. కాలానుగుణ్యముగ సంచరించు ప్రాజ్ఞురా లగుమంగమ్మయే కనుక ఆనాళ్ళలో లేకపోయినచో, తంజాపురాంధ్ర నాయకరాజ్యము వలె, మధురనాయక రాజ్యము కూడ త్వరలోనే పతనమై యుండెడిది. అనగా మధురలో తెలుగువారి పరిపాలనాధికారము క్రీ. శ. 1706 వ సంవత్సరముతోనే అంతమై యుండెడిది. అట్లుకాక యింకను ముప్పది సంవత్సరములవరకు తెలుగు వారు తమిళనాడును పరిపాలింపగలిగి రన్నచో, ఆ కీర్తి మహా రాణి మంగమ్మగారికి చెందుచున్నది.

రాణిమంగమ్మ చొక్కనాథ నాయనింవారి పట్టమహిషి; చంద్రగిరి దూపకల్‌కు చెందిన దళవాయి తుపాకుల లింగమ నాయకుని కుమార్తె. మధురరాజైన తిరుమలరాయని చరిత్ర మను నొక చారిత్రక లేఖనము నం దీవిధముగ నున్నది. "చెంద్రగిరి తుపాకుల లింగమనాయనివారి కుమార్తె మంగమ్మ గారు మహా రూపయవ్వనకళా సమేతయై వుండే వర్తమానం విని శ్రీరాజా చొక్కనాథ నాయనివారు తుపాకుల లింగమ నాయనివార్కి తగుమనుష్యుల నంపించి......మంగమ్మను వివాహం చేసుకొని..." చొక్కనాథ నాయనయ్య మంగ మ్మను బహుశః 1674–75 సంవత్సర ప్రాంతమున పరిణయ మాడి యుండ నోపును. ప్రశస్త మగు నీ చారిత్రక లేఖనము చెన్నపురి ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారమున గలదు.

చొక్కనాథనాయకుడు తొలుదొలుత తంజావూరు నేలు విజయరాఘవ నాయకుని కుమార్తెను పెండ్లి చేసికొన నభిలషించెను. కాని విఫలమనోరథు డయ్యెను. పూర్వవైర ములను పురస్కరించుకొని విజయరాఘవ నాయకుడు తన కుమార్తెను మధురాపురాధీశ్వరున కిచ్చి వివాహము చేయు టకు నిరాకరించెను. మధురనాయక రాజులు అభిజాత్యులు కారని తంజావూరు నాయక రాజుల విశ్వాసము. విజయరాఘవ నాయకుడు చొక్కనాథనాయకుని యభీష్టమును తిరస్కరిం చుట కది యొక్కటియే కారణము కాదు. మరికొన్ని కారణ ములు కూడ గలవు. ఏమయిన నేమి తుదకు వా రిరువురును యుద్ధమునకు దిగిరి. మధుర సైన్యములకు దళవాయి సముఖము వేంకటకృష్ణప్ప నాయకుడు నాయకత్వము వహించెను. తంజా వూరి పక్షమున దళవాయి రంగప్పనాయడు, వీరబాణం చిన్న రాజు మున్నగు వీరయోధులు పాల్గొనిరి. ఇరువాగులందును విపరీతముగ నష్ట మేర్పడెను. భయంకర మగు నాసంగ్రామమున వీరయోధులు "కొందరు చాలా గాయాలు తీస్కునినారు. కొందరు దప్పి తాళలేక క్రిందపడి పొర్లాడుచున్న కాల్వలుగా వచ్చే రక్తాన్ని జలము అని భ్రమచేత పానం చేశినారు." ఆయుద్ధమునందే విజయరాఘవ నాయకుడు వీరస్వర్గము నలంకరించెను.

తంజావూరు యుద్ధము ముగిసినతోడనే చొక్కనాథ నాయకుడు మంగమ్మను పరిణయ మాడి యుండవచ్చు నని భావింపబడుచున్నది. తంజావూరు యుద్ధము 1674 వ సంవ

త్సరమున జరిగినందువలన, 1674–75 సంవత్సర ప్రాంతమున మంగమ్మ వివాహము జరిగె నని పేర్కొనదగును. ఈవిషయమై చరిత్రకారులలో అభిప్రాయభేదములు గలవు.

చొక్కనాథనాయకుని మరణానంతరము అతని కుమారుడు మూడవ ముద్దువీరప్పనాయనయ్య సింహాసనమునకు వచ్చెను. సింహాసనమునకు వచ్చునాటి కతడు రమారమి సప్తవర్ష ప్రాయుడు. ఏడు సంవత్సరములు మాత్రమే రాజ్యము చేసె నని మదురై త్తలవరలాఱు (మధురానగర చరిత్ర) అను నొక తమిళచారిత్రక లేఖనము నుడువుచున్నది. కాని మధురధారాజైన తిరుమలరాయని చరిత్రలో అతడు తొమ్మిది సంవత్సరములే రాజ్యము చేసినట్లు కలదు. ఏది యెట్లున్నను, మూడవ ముద్దు వీరప్పనాయనయ్య చాల తక్కువ కాలము రాజ్యపాలనము చేసె ననుట సమంజసము. కాని అతడు మరణించునాటి కతనిభార్య యగు ముద్దమ్మ గర్భము ధరించినట్లు సువిదిత మగుచున్నది. కనుక పదునాలుగు సంవత్సరముల వయసునాటికే మూడవ ముద్దువీరప్ప నాయనయ్య పితృస్థానము నలంకరింప నర్హుడయ్యె నని నుడువవలసి యున్నది. ఇదియే నిజమైనచో, 1674–75 సంవత్సర ప్రాంతమున వివాహము జరిగిన మంగమ్మకు 1675–76 సంవత్సర ప్రాంతమున సంతానము కలిగె నని స్పష్ట మగుచున్నది. కాని ఒక్కవిషయము మాత్రము సుస్పష్టము. తంజావూరు యుద్ధము ముగిసిన పిమ్మటనే, అనగా 1674 వ సంవత్సరమున, విఫలమనోరథు డయిన చొక్క

నాథ నాయకుడు మంగమ్మను పరిణయ మాడెనని నిస్సంశయ ముగ నుడువదగును.

మూడవ ముద్దువీరప్ప నాయకుడు మంగమ్మకు జన్మించినవాడు కాదని సంశయించువారును కొంద రున్నారు. 1687 వ సంవత్సరమున వేయబడిన యొక శాసనమునందు ముత్తమ్మ యను నామె ముద్దువీరప్పనాయకుని తల్లిగా పేర్కొనబడుటయే సంశయమునకు హేతుభూత మయినది. కాని ముద్దు వీరప్పనాయనయ్య మంగమ్మగారి తనయు డని తలచుటకు కొన్ని యాధారములు గలవు.

వికటకవి గోపాలరాయ డనునొకకవి రాణిమంగమ్మపై నొకప్రత్యేక గ్రంథము రచియించెను. దానిపేరు మధుర మంగాపుంశ్చలీ లీలావిలాసము. ఆగ్రంథము నం దిట్లు కలదు.

"చొకనాథ మహీశుఁడు దాఁ జచ్చిన
ప్రకటంబుగ నటుబలెఁ దనకొడు కగు
రంగ కృష్ణ ముద్దు వీరాఖ్యుఁ డీల్గిన..."

మూడవ ముద్దువీరప్ప నాయకుని మరణానంతరము గర్భవతిగా నున్నయతని సతీతిలకము సహగమనము నాచరించుటకు యత్నించెను. రాజకుటుంబములందు భర్తృమరణానంతరము భార్య సహగమనము నాచరించుట ఆనాళ్లలో పరిపాటిగ నుండెను. అయినను మంగమ్మ కోరికను మన్నించి ముద్దమ్మ సహగమనము నాచరింపలేదు. కాని సంతానవతి

మైన తోడనే ఆయిల్లాలు ప్రాణత్యాగము చేసి పరలోకమున నున్న తనభర్తను కలిసికొనెను. అనంతర మా శిశువును పెంచి పెద్దచేయు భారము మంగమ్మపై పడెను.

మంగమ్మగారా పసికూనకు విజయరంగ ముద్దు చొక్కనాథు డని పేరిడెను. అతడే మూడవ ముద్దువీరప్ప నాయునిం వారి యనంతరము మధుర రాజ్యమునకు వారసు డయ్యెను. మూడవనెల వచ్చినపిమ్మట అతనిని మంగమ్మ సింహాసనమున కూర్చుండబెట్టెను. కాని విజయరంగ చొక్కనాథ నాయనయ్యు 'పసిబిడ్డగా వున్నందువల్ల ఆయన అవ్వయైన మంగమ్మ బిడ్డను ఒడిలో కూర్చుండబెట్టుకుని' సంరక్షణ కర్త్రిగా ఆమె రాజ్యము చేయసాగెను.

రాజకీయము లనిన మంగమ్మకు గల యాసక్తి నిరుపమానము. వస్తుత: చాల తెలివి తేటలు గల మగువ యామె. సమయానుకూలముగ సంచరించుటలో అందెవేసిన చేయి. ఈవిశిష్టగుణము లామెలో మూర్తీభవించి యుండుటచే పరిపాలన దృష్ట్యా ఆమె చిరయశస్సు గడింపగలిగెను. వంశానుగతముగ వచ్చుచున్న సహగమనాచారము నతిక్రమించి మంగమ్మ రాజ్యము చేసె నన్నచో ఆమె మహాసాహసురాలనియు, రాజకీయములం దాసక్తి గల మహిళ యనియు, సంస్కరణాభిలాషగల విశాలహృదయ యనియు పేర్కొనుట సముచితము.

మూఢవిశ్వాసములకును, పూర్వాచారములకును పట్టు గొమ్మగానున్న యాదినములలో సంఘమును సాంఘికాచార ములను ధైర్యస్థైర్యములతో ప్రతిఘటింప గలిగె నన్నచో, మంగమ్మ గుండె దిటవు వర్ణనాతీతము. ఆమె మహాసాహసు రాలనుట చర్విత చర్వణము కాజాలదు. పూర్వాచారములం దామెకు విశ్వాసము లే దనుట నిస్సంశయము. పతిపోయిన తోడనే చితి నెక్కుట పడతుల కాచారముగా నుండెను. దీనిని ముఖ్యముగా రాజకుటుంబముల వా రాచరించుచుండిరి. తంజావూరి విజయరాఘవ నాయకుడు విగతజీవు డయినపిదప, తంజావూరి యంతఃపురాంగన లెల్లరు ప్రాణత్యాగము చేసిరి. మధుర నేలిన ముద్దుతిరుమలశౌరి నాయనయ్య (1623–1659) మరణానంతరము, అంతఃపురమున నున్న యతని యిన్నూరు మంది భార్యలును సహగమన మాచరించిరట. అటులనే మరవ దేశాధిపతి యగు కిళవన్ సేతుపతి (తిరుమలసేతుమతి) మరణా నంతరము అతని నలువదియేడుగురు భార్యలును చితి నెక్కి మరణించిరి.

ఈ విషయాదికమును బట్టి చూడగా చొక్కనాథ నాయకుని మరణానంతరము సహగమనము నాచరింపక మంగమ్మ రాజ్యము చేసెనన్నచో ఆమెయెట్టి సాహసురాలో మన మూహించుకొనవలసినదే. మీఁదు మిక్కిలి కోడలు ముద్దమ్మ భర్తృ మరణానంతరము ప్రాణత్యాగమునకు సన్నద్ధు రాలు కాగా ఆ జతనమునుండి ఆమెను మంగమ్మ వారిం

చెను. అటుల మంగమ్మ తాను సహగమనమునకు తిలోదక ములు వదలుటయే కాక తదాచారమును రూపుమాపుట కును యత్నించె నని నుడువ దగును.

మంగమ్మగా రధికారమునకు వచ్చునాటికే భారతా వనిలో మొగల్ చక్రవర్తులు ప్రబలురై యుండిరి. దక్షిణ భారతము కూడ వారి యధీనములో నుండెను. మైసూరు పరి పాలకుడును, హాగలుగగ్గోలురాయుడు నగు చిక్కదేవరాయ లంతటివాడే మొగల్ చక్రవర్తులకు సామంతుడై రాజ్యాధి కారము చేయుచుండెను. ఇక ఇతరులను గురించి నుడువ నవసరము లేదు. అందువలన గత్యంతరము లేక మంగమ్మయు మొగల్ సార్వభౌముల యాధిపత్యమును శిరసావహించెను.

1697 వ సంవత్సరమునందు మొగల్ సేనాని జుల్ ఫిక్ఖాను దక్షిణాపథమున కేతెంచినపుడు మంగమ్మ విలువగల కానుక లొసగి యతని యాదరాభిమానములకు పాత్రురా లయ్యెను. తుదకు మొగల్ సైన్యసహాయముతో ఆమె కోల్పోయిన కొన్ని ప్రదేశములను కూడ సంపాదించెను. కాగా మంగమ్మగారి కాలములో మధుర రాజ్యము విస్తరిల్లెను. అటుల రాజ్యవిస్తీర్ణత నుద్దేశించి ఆమె పాటుపడు చున్న కాలములో మైసూరు చిక్కదేవ రాయలవారి సైన్యా ధ్యక్షు డగు దళవాయి కుమారయ్య తిరుచ్చిరాపల్లిని 1690–94 సంవత్సరముల ప్రాంతమున ముట్టడించుటకు ప్రయత్నించెను. కాని యాసమయమునందే మహారాష్ట్రులు మైసూరును

ముట్టడించుటచే కుమారయ్య స్వదేశమునకు తిరుగుముఖము పట్టెను. అందువలన మైసూరివారిని ప్రతిఘటించు నవసరము మంగమ్మకు కలుగలేదు.

ఆటుపిమ్మట 1697 వ సంవత్సరమున మంగమ్మ తిరువాంకూరు పరిపాలకు డగురవివర్మతో పోరాడవలసి వచ్చెను. తిరువాంకూరు పాలకులు మధురరాజ్యాధినేతల యెడల విధేయులై సంచరించుచు సక్రమముగ కప్పము చెల్లించుచుండిరి. మూడవ ముద్దువీరప్పనాయని కాలమున గూడ తిరువాంకూరు పాలకులు విధేయులైయుండిరి. కాని మంగమ్మకాలమున అప్పటిపాలకు డగురవివర్మ కప్పము చెల్లింప నిరాకరించెను.

మంగమ్మకాలమున దళవాయి నరసప్పయ్య యనునతడు సైన్యాధ్యక్షపదవి యందుండెను. అతడు మహాస్వామిభక్తుడు. బాహుబలసంపన్నుడు. ఆతని నాయకత్వమున మధురసైన్యములు తిరువాంకూరు ముఖ్యపట్టణ మగుకోర్కుళమును ముట్టడించెను. దళవాయి నరసప్పయ్యను రవివర్మ ప్రతిఘటించెను. కాని లాభము లేకపోయెను. విజయలక్ష్మి నరసప్పయ్యనే వరించెను. ఈ విజయముతో తిరువాంకూరు మంగమ్మగారి హస్తగత మయ్యెను.

తిరువాంకూరు యుద్ధము ముగిసిన మూడేండ్లకు, అనగా, 1700 లో తంజావూరునేలు శాహాజీ మధురరాజ్యము నందలి కొన్ని ప్రదేశములను తన స్వాధీనము చేసికొన దలచెను. శాహాజీని ప్రతిఘటించుటకు దళవాయి నరసప్పయ్యయే

నియుక్తు డయ్యెను. మొగలుసైనికులు కూడ నరసప్పయ్యకు తోడ్పడినట్లు తెలియుచున్నది. ఆయుద్ధమునందు తంజావూరి సైనికులు పలువురు మృత్యుముఖమున పడిరి. శాహాజీకి చెప్ప నలవికాని నష్ట మేర్పడెను. కడపట అతడు దళవాయి నరస ప్పయ్యతో సంధి చేసికొనెను.

తంజావూరు యుద్ధములో కూడ మంగమ్మగారికే విజయము లభించినను అచిరకాలముననే యొక విచిత్ర సంఘటన మూలమున మంగమ్మయు శాహాజీయు మిత్రు లయిరి.

మైసూరి చిక్కదేవరాయలు విశేషవిఖ్యాతి నార్జించిన యుద్ధవీరుడే కాక బుద్ధికుశలత గల పరిపాలకుడును. కావేరినదీ జలములను తన దేశమునకు మరలించుకొనవలె ననునభిలాషతో అతడు కావేరిమీద నొకయానకట్ట నిర్మించెను. త న్నిర్మాణము మంగమ్మకును, శాహాజీకిని కోప హేతు వయ్యెను. చిక్కదేవరాయలను వారిరువురును కలసి ప్రతిఘటింపదలచిరి. అదృష్టమో దురదృష్టమో, అంతలో వర్షములు విరివిగ కురిసి వెల్లువలు వచ్చి చిక్కదేవరాయలు నిర్మించిన యా యానకట్టను ధ్వంస మొనర్చెను. కాగా చిక్కదేవరాయలను మార్కొనునవసరము మంగమ్మకుగాని, తంజావూరిపాలకునికి గాని కలుగ లేదు.

బలవంతు డగుమన్నీడు లేనిచో సాధారణముగ సామంతులు స్వాతంత్ర్యము ప్రకటించుకొన నభిలషింతురు. మంగమ్మగారి పరిపాలనాకాలములో మధురరాజ్యాధినేతలకు

సామంతు లనదగు పరిపాలకులు కొందరు స్వాతంత్ర్యము ప్రకటించుకొన ప్రయత్నములు సలిపిరి. అట్టివారిలో తిరుమల సేతుపతి బిరుదాంచితుడును, మరవదేశాధిపతియు (రామనాథ పురము) నగు కిళవన్ సేతుపతి (వృద్ధసేతుపతి) ప్రముఖుడన దగును.

1678 వ సంవత్సరమున కిళవన్ సేతుపతి మధురను ముట్టడించెను. కాని దళవాయి నరసప్పయ్య ప్రదర్శించిన ధైర్యోత్సాహములకు ఫలితముగ మరవ వీరులకు జయము లభింపలేదు. అంతమాత్రమున వారు నిరుత్సాహము చెంద లేదు. మరల 1702 వ సంవత్సరమునందు కిళవన్ సేతుపతి మంగమ్మతో యుద్ధము ప్రకటించెను. తంజావూరి పరిపాల కుడు మధురసైన్యములకు సహాయముగ ఆయుద్ధమున పాల్గొ నెను. పలుమారులు మధురను శత్రువుల బారినుండి సంర క్షించి యఖండయశస్సు నార్జించిన దళవాయి నరసప్పయ్య యాధ్వర్యమున మధురసైన్యములు మరవ సైన్యములను మార్కొనెను.

మరవ వీరయోధులు సామాన్యులు కారు. భుజబల సంపన్ను లని కీర్తి గడించినవారు. దురదృష్టవశమున ఆయుద్ధ ము ముగియక మునుపే దళవాయి నరసప్పయ్య వీరస్వర్గము నలంకరించెను. మహారాణి మంగమ్మకు కుడిబుజము పడిపోయి నట్లయ్యెను. మధురవీరయోధులు తమనాయకుని కోల్పో యిరి. అంతిమవిజయము కిళవన్ సేతుపతికి లభ్య మయ్యెను.

తత్ఫలితముగ సేతుపతి మధురనాయక రాజ్యముతో గల సంబంధ బాంధవ్యములను తెగ్రతెంపులు చేసికొని స్వతంత్రు డయ్యెను. మరవదేశము స్వతంత్రరాజ్య మనియు ప్రకటించెను. తదాదిగ తిరుమలసేతుపతి పేరు పెంపులే కాక అతని ప్రాబల్యము కూడ దక్షిణాపథమున వ్యాప్తము కాజొచ్చెను. రామనాథపురమునకు చుట్టుప్రక్కలనున్న ప్రదేశములను కూడ కైవసము కావించుకొని అతడు మరవరాజ్యమును విస్తృత పరిచెను.

రాణి మంగమ్మకు అపజయము కలిగినది ఒక్క సేతుపతితో కావించిన యుద్ధమునందే. దళవాయి నరసప్పయ్య సహకార సానుభూతులు లభించినంతకాలము మంగమ్మ అపజయ మనుమాట నెరుగదు. ఒకవైపు మొగల్ చక్రవర్తులును, మరియొక వైపు మైసూరుపాలకుడు చిక్కదేవరాయలును, ఒకప్రక్క తంజావూరు ప్రభువును, మరి యింకొక దెస మరవదేశాధిపతి యగు కిళవన్ సేతుపతియు, వేరొకవైపు తిరువాంకూరు ప్రభువు రవివర్మయు మంగమ్మగారి కాలములో మధురరాజ్యమును కబళింపదలచిరి. త దుద్దేశముతో వా రామెతో తలపడిరి. కాని మంగమ్మ ప్రదర్శించిన రాజనీతియు, ధైర్యోత్సాహములును, సమయానుకూలముగ సంచరించిన నైపుణియు, ఆమె తెలివితేటలును శత్రురాజుల యాటల సాగనీయలేదు. లేకున్నచో మధుర నేలిన కడపటిరాణి యగు

మీనాక్షమ్మ కాలమున గాక రాణి మంగమ్మకాలమునం దే మధురనాయక రాజ్యము కాలగర్భమున కలసియుండెడిది.

రాజకీయముగా మంగమ్మగారు గడించిన చిరయశస్సు ఒకయెత్తు; ఆమెచేసిన దానధర్మములవలనను, ప్రదర్శించిన మతసహనమువలనను గడించిన చిరయశస్సు ఒకయెత్తు. ఆమె సాధించిన రాజకీయవిజయము లామెతోనే యంతరించినను, ఆమె సంతరించిన సప్తసంతానములు మాత్రము నేటికిని నిలిచియున్నవి. అవి యామెకీర్తిని ప్రపంచపరివ్యాప్తమొనర్చు చున్నవి. ఈ హేతువును పురస్కరించుకొనియే భారతావనిలో రాజ్యముచేసిన రమణీమణులలో రాణిమంగమ్మకు సాటివచ్చు వారు పలువురు లే రనుట!

మధుర నేలిన నాయకరాజు లందరివలె, మంగమ్మ కూడ మతసహిష్ణుతను ప్రదర్శించిన విశాలహృదయ. దేవాలయములకు దానధర్మములు విరివిగా చేసినట్లే, ఆమె మహమ్మదీయులయు క్రైస్తవులయు దేవాలయములకు గూడ విరివిగా దానధర్మము లొనర్చెను. దానధర్మము లొనర్చుటలో ఆమె 'తన మన' అని చూడలేదు. ఆమెదృష్టిలో సర్వమతములును, సర్వవర్ణములు నొక్కటే. మంగమ్మ మతసహిష్ణుత నాధారము చేసికొని క్రైస్తవ మతప్రచారకులు మధుర రాజ్యమున బాహాటముగా మతప్రచారము చేసికొనుచుండిరి. మహమ్మదీయులు కూడ నామె యాదరాభిమానములకు పాత్రులై యుండిరి. 1692, 1701 సంవత్సరములలో ఆమె కొన్ని

మసీదులకు దానధర్మము లొనర్చినట్లు శాసనములవలన సువిదిత మగు చున్నది.

రాజ్యక్షేమము దృష్ట్యా క్రైస్తవమతానుయాయులను నిర్బంధించుట శ్రేయస్కర మని తంజావూరు పాలకుడు సలహా చెప్పగా, అందులకు మంగమ్మ యిటుల సమాధాన మొసగె నట. "కొందరు శాకాహారులు. మరికొందరు మాంసాహారులు. అటులనే తనకు ఉత్తమ మని తోచిన మతము నవలంబించుటకు ప్రతిమానవునికి అధికారము గలదు."

అటుల రాణిమంగమ్మ మతసహనమును ప్రదర్శించుచు రాజ్యము చేయుచున్న కాలమున రామనాథపురము నం దొక విచిత్రసంఘటన జరిగెను. కిళవన్ సేతుపతి దగ్గరిచుట్టములలో నొకడు క్రైస్తవమతమును స్వీకరించెనట! అతడే సేతుపతికి పిమ్మట సింహాపీఠ నలంకరింపవలసినవాడు. కనుక అతని మత స్వీకారము ప్రజకు మిక్కిలి యసభ్యముగా తోచెను. క్రైస్తవ మతబోధకుల వలన మరవదేశమున మున్ముందు మరెట్టియరిష్టములు సంభవించునో యని సంశయించి మరవలు క్రైస్తవమత ప్రచారకులను, తన్మతాంతరులను బాధింపదొడగిరి. రామనాథపురము నందలి యొక చర్చిని కూడ వారు ధ్వంస మొనర్చిరట! ఈ యుదంతమునుండి మంగమ్మ ప్రదర్శించిన పరమత సహనము నిరుపమాన మని తేటతెల్ల మగుచున్నది.

ఇక మంగమ్మగారు దేవాలయములకు కావించిన దానధర్మములును, ప్రజోపయోగార్థము వెలయించిన సత్త

సంతానములు ననేకములు. మధురలోని మీనాక్షీ సుందరేశ్వ రాలయమునకును, ఉత్తమపాలెములోని యీశ్వరాలయము నకును ఆమె విరివిగా ధర్మకార్యములు చేసినట్లు తెలియు చున్నది.

సోళవంద మనుస్థలమున మంగమ్మ యొక పెద్దసత్రమును నిర్మించి దానికి భూదానము కూడ నొసర్చెను. రైలు పడక పూర్వ మాసత్రము రామేశ్వరము పోవు యాత్రికులకు మిక్కిలిగా తోడ్పడెను. రామేశ్వరమునకు పోవుబాటలమీద ఆమె పెక్కుచావడులు కట్టించెను. వానిలో కొన్ని నేటికిని నిలిచియున్నవి. శివలూరు, తడంపట్టి మున్నగు స్థలములందును సత్రములను చావడులను నిర్మించెను. పెక్కుప్రదేశములందు తటాకకూపములు త్రవ్వించెను. వ్యవసాయాభివృద్ధికి కూడ ఆమె పాటుపడెను. మంగమ్మగారు నిర్మించిన కట్టడములలో కొన్ని నేడు ప్రభుత్వకార్యాలయములుగా నున్నవి. మధుర రైల్వేస్టేషనున కభిముఖముగా నున్న సత్రము మంగమ్మ సత్ర మని నేటికిని వ్యవహరింపబడుట సంతసింపదగిన విష యము. ఇటుల తమిళనాడున సర్వేసర్వత్ర మంగమ్మగారి పేరు ప్రతిధ్వనించుచున్నది.

మంగమ్మ దాననిరతిని గురించి రుచికరము లగు పెక్కు కథలు ప్రచారమున నున్నవి.

'ఒకనాడు విడియము వేసికొనుచు మంగమ్మ పొరపా టున ఎడమచేతితో వక్కపొడిని నోటిలో వేసికొనెను. చేసిన

తప్పును గ్రహించి, పిమ్మట నామె ప్రాయశ్చిత్తము చెప్పుడని పండితుల నడిగెను. అందులకు వారు దానధర్మములు విరివిగా చేయు డనియు, అదియే ప్రాయశ్చిత్త మనియు నుడివిరట. నాటినుండియు మంగమ్మగారు దానధర్మములు చేయసాగెను.'

ఈ కథకు కాలుసేతులు లేవని భావింపనగును. ఏలయన, మధురనేలిన తెలుగురాజు లెల్లరు దానశీలురు. దాననిరతి వారికి పుట్టుకతోనే యలవడిన విశిష్టగుణము. దానకర్ణులుగా వారు చరిత్రలో వాసి కెక్కిరి. కనుక పండితు లాదేశించిన నాటినుండియు మంగమ్మ దానధర్మము లొనర్పసాగెననుట హాస్యాస్పదము. మరియొక మధురగాథనుకూడ నిట నుదాహరించుచున్నాను.

'బాహుబల సంపన్ను డనియు, ప్రజ్ఞాన్వితు డనియు వాసి కెక్కిన మైసూరి చిక్కదేవరాయలు ప్రతిదినము తన ధనాగారమునందు కొంతధనమును పదిలపరచిన పిమ్మటనే యతడు వేరొకపనిని చూచెడివాడట. అతని కంతధనకాంక్ష! మరణానంతర మతడు నరకమునకు పోయెను. కొంతకాలము గడచిన పిదప ఒకనాడు నరకలోకమునకు యమదూత లొకనిని తీసికొనివచ్చిరి. అతడు మైసూరుపౌరుడు. ఒకనిని తీసికొని వచ్చుటకు మారుగా పొరపాటున నతనిని యమభటులు నరకమునకు తీసికొనివచ్చిరి. చేసినతప్పిదమును తెలిసికొని వా రా మైసూరుపౌరుని మైసూరునకు పంప నిశ్చయించిరి.

అంతలో చిక్కదేవరాయ లా పౌరుని చూచి యత నితో తాను నరకమున పలు బాధలు పడుచుంటి ననియు, అచిర కాలముననే మహారాణి మంగమ్మగారు మరణించు ననియు, ఆమె దాననిరతిని దేవలోకవాసులు వేనోళ్ల పొగడుచున్నా రనియు, కనుక నామెకు ఘనమైన స్వాగతము లభింపగలద నియు నుడివెనట. పిదప ఆ పౌరుడు మైసూరునకు మరలివచ్చి నరకలోకమున నడచిన కథను సవివరముగ చిక్కదేవరాయల వారి కుమారునికి తెలియజేసెను. నాటినుండియు నతడు దానశీలుడై దానధర్మము లసంఖ్యాకముగా చేసి చిక్కదేవశౌరికి స్వర్లోకప్రాప్తి యగునట్లు చేసెను.'

ఇది కేవలము కల్పితగాథ యనుట సమంజసము. కాని మంగమ్మగారి దానశీలమును, చిక్కదేవరాయల లోభ గుణమును కండ్లకు కట్టునట్లుగా తెలియజెప్పుట కీకథను ప్రజలు కల్పించి యుందు రనుట నిర్వివాదము. ఇది కేవలము కట్టుకథయే యైనను, ఈ కథ యానాటి తెలుగువారి దాననిరతిని, విశాలహృదయమును తేటతెల్లము చేయుచున్న మధురగాథ. ఇది నిజముగా జరిగియుండకపోయినను, ఇందు పేర్కొనబడిన కొన్నివిషయములు మాత్రము నమ్మదగినవి. చిక్కదేవరాయల మరణానంతరమే, అనగా 1706 లో, మధుర నేలిన యా తెలుగురాణి దైవికము చెందెను. దాన నిరతివలననే ఆమె చిరయశస్సు గడించెను.

మంగమ్మ సంస్కరణాభిలాష గలమహారాణి యని తొలుతనే పేర్కొనబడినది. ఆమె సంస్కార ప్రియత్వమును గురించి కూడ కథ యొకటి వాడుకలో నున్నది.

మధురానగరమున పట్టునూలు కరణు లనుచేనేత పారిశ్రామికు లున్నారు. వారు సదాచారసంపన్నులు. వారి యాచార వ్యవహారములు బ్రాహ్మణుల యాచార వ్యవహారములను తలపించు చూడును. బ్రాహ్మణులవలె వారును ఉపాకర్మ మాచరించుచుండిరి. ఈ విషయమును తెలిసికొనిన మధురానగరాధికారి వారిని శిక్షింపదలచెను. అందువలన నగరాధికారి నడతను పట్టునూలు కరణులు మంగమ్మగారి కొకవిజ్ఞప్తి మూలముగ తెలియజేసిరి. అప్పుడు పట్టునూలు కరణుల కుపాకర్మాధికారము కలదో లేదో యని తెలిసికొను నుద్దేశముతో మంగమ్మ యొక పండితపరిషత్తు నేర్పాటు చేసెను. ఆ పండితపరిషత్తు పట్టునూలు కరణులపక్షమే పలికెను. అటుపిమ్మట పండితపరిషత్తు నిర్ణయము నొకపత్రము మీద వ్రాయించి దానిని పట్టునూలు కరణుల కొసగెను. ఆపత్ర మిప్పటికిని పట్టునూలు కరణులయొద్ద నున్నదట.

ఇంతదనుక మహారాణి మంగమ్మగారి రాజకీయ జీవితమును, సంఘసంస్కరణాభిలాషను గమనించితిమి. ఆమె వ్యక్తిగత జీవితమును పరిశీలించితిమేని మంగమ్మ కలుషితశీల యని నుడువవలసి యుండును. ఆమె స్త్రీమాత్రగా తోచదు. నీతి నియమములను, సిగ్గుబిడియములను విడనాడిన వెలది యామె.

1650–1700 ప్రాంతములందు తంజావూరు, మధుర, ఆనెగొంది మున్నగు రాజ్యములందు జరుగుచుండిన ఘోరములను, అసభ్యప్రవర్తనములను, నీతి విదూర కృత్యములను విపులముగ నభివర్ణించుచు వికటకవి గోపాలరాయడు మధుర మంగాపుంశ్చలీ లీలావిలాస మను కావ్యమును రచియించెను. ఈగ్రంథమును వ్రాసినంతకాలము అతడు తద్రచనాపాప పరిహారార్థము శ్రీరామమంత్రమును జపించుచుండెనట! ఈ గ్రంథము నందలి యసభ్యత నూహించుటకీ యొక్క వాక్యమే చాలును.*

శిల్పశాస్త్రజ్ఞులను, గాయనీ గాయకులను పోషించిన మంగమ్మ కవిపండితుల కాశ్రయ మొసగి వారిని కావ్యరచనమునకు ప్రోత్సహించి యుండలేదు. అయినను, నాటి రాజాస్థానములందు జరుగుచుండిన ఘోరములను చూచి భగ్నహృదయు డయిన వికటకవి గోపాలరాయని పుణ్యమా యని దుశ్చరిత యగు మంగమ్మ కూడ తెలుగువాఙ్మయమున స్థానము సంపాదించుకొన గలిగెను. ఏమయిననేమి, మధురలో గ్రంథరచనకు మంగమ్మ కారణభూతురా లయినది. ఆమె వేయించిన పెక్కు శాసనములు తెలుగులోనే యుండుట గమనింపదగు విషయము.

---

* మంగమ్మ జీవితమునకు సంబంధించిన కొన్ని విషయములను నాకు తెలియజేసిన మన్మిత్రులు శ్రీ తిమ్మావఝల కోదండరామయ్య గారికి కృతజ్ఞుడను.

మంగమ్మకు కోడెకాండ్రు పలువు రుండిరట. వారిలో ముఖ్యులు నరసయ్య (దళవాయి నరసప్పయ్య యగునేమో), అచ్చయ్య (మంగమ్మ మంత్రి) మొదలగువారు. మంగమ్మ శీలమును గురించి యింతకంటె నెక్కువగా నిచ్చట పేర్కొనుట అసమంజసము.

మధురమంగా పుంశ్చలీ లీలావిలాసము మధుర నేలిన రాణిమంగమ్మకు సంబంధించినది కాక మధురా నగరము నందలి మంగ యను నొకవేశ్యకు సంబంధించిన దై యుండవచ్చు నను సంశయ మొకటి కలదు. ఇదియే కనుక సత్య మైనచో మహారాణి మంగమ్మ సర్వవిధముల సాటిలేని రాణి యనదగును. కాని ఆమె మరణవృత్తాంతము కూడ కొంతవరకు మంగమ్మ కలుషితశీలమునే బలపరుచు చున్నది.

మంగమ్మ మనుమడు విజయరంగ చొక్కనాథ నాయకుడు పెద్దవాడయిన పిదప స్వాయముగా నతడే రాజ్యవ్యవహారములను పర్యవేక్షింపసాగెను. మంత్రి అచ్చయ్యకు మంగమ్మ వలపునేస్తముగా నుండె నని సంశయించి విజయరంగ చొక్కనాథనాయకుడామెను ఆమె నివసించు భవనమునందే నిర్బంధించి బాధించెనట. అంత్యకాలమున ఆ మహారాణికి పట్టెడు మెతుకులు కూడ కరవయ్యెనట. అన్నము లేక కృశించిపోయి మధురనేలిన మహారాణి మంగమ్మ కడపట మరణించెను.

మంగమ్మ వ్యక్తిగత జీవితమును విడనాడి, విశాల హృదయముతో ఆమె రాజకీయముగ సాధించిన విజయములను, సంఘసంక్షేమదృష్టితో సలిపిన మహాత్కార్యములను, ప్రదర్శించిన మతసహనమును పరిశీలించితిమేని మంగమ్మ సాటిలేని సామ్రాజ్ఞి యనదగును. ఆమె త్రవ్వించిన తటాక కూపములును, నిర్మించిన సత్రములు చావడులును, చేసిన దాన ధర్మములు నామెను ధన్యచరిత్రగా నొనర్చెను. నేటికిని తమిళనాడులో మహారాణి మంగమ్మగారి పేరు వినబడు చుండుట గమనార్హము.

---

# నాయక రాజుల నాటి మధుర

ఆంధ్రుల చరిత్రయందే కాక దక్షిణ భారతదేశ చరిత్రయందును క్రీస్తుశకము 15, 16, 17 శతాబ్దములలో మధుర (పాండ్యమండలము) నేలిన నాయకరాజుల చరిత్ర మొక మధురాధ్యాయము! బలసంపన్నులు, 'మేరు సమాన ధైర్యయశ స్తిలకులు' నైన యా తెలుగు దొరల పరిపాలనా కాలములోనే దక్షిణ భారతమున తెలుగు మాటకు, తెలుగు పాటకు నొక క్రొత్త చెలువము, నొక క్రొత్త సోయగము లభించినవి. వారు సాగించిన సమరము లును, సాధించిన విజయములును సంస్మరణీయములు. ఆ జైత్ర యాత్రలు సంస్కృతీ విజయగాథ లన్నను అతిశయోక్తి కానేరదు. శిల్ప చిత్రలేఖనాది లలితకళలకు పాదులు వెట్టి, నీరు పోసి పోషించిన కళారాధకులు వారు. ఈ నాయక రాజు లందరు మతసహిష్ణుత ప్రదర్శించిన విశాలహృదయులు. ప్రజోపయోగార్థము సత్రములు, చావడులు, చెరువులు, బావులు మున్నగువాని నెన్నియో వినిర్మించి మహిత యశస్సు సముపార్జించిన మహనీయులు వారు.

మధురనాయకరాజులలో ఆరుహన్నిబ్బరగండ బిరుద విరాజితుడగు (డెబ్బదిరెండు పాళెములు జయించినవాడు) విశ్వనాథనాయకుడు ప్రథముడు. ఇతడే మధుర నాయక రాజ్యస్థాపనాచార్యు డని కొందరు విశ్వసించుచున్నారు. ఇతనితో (1529–1564) ప్రారంభ మయిన మధురనాయకరాజుల పరిపాలనము రాణి మీనాక్షి కాలములో (1732–1736) అంత మయ్యెను. ఇందులకు పెక్కు కారణములు కలవు.

రాణి మంగమ్మకు పిమ్మట సింహాసనమునకు వచ్చిన వారు విశాలదృక్పథము గల రాజనీతియు, దూరదృష్టియు లేనివా రగుటచే ఆనాటి రాజకీయ పరిస్థితుల కనుగుణముగా వారు వ్యవహరింప లేకపోయిరి. ఇరుగు పొరుగు రాజులతో స్నేహపూర్వక సంబంధములు స్థాపించు కొనుటకు బదులుగా వారితో వైరము సాధించిరి. ఆదినుండియు నాయక రాజులు తమరాజ్యమును శత్రుదుర్భేద్యము కావించుకొను చుండిరే కాని సముద్రతీరమున నున్న రాజుల యొక్కయు, పాశ్చాత్యవర్తకుల యొక్కయు ప్రాబల్యమును గుర్తింపరైరి.

ఆ యవకాశమును పురస్కరించుకొని మరవ దేశాధిపతు లగుసేతుపతులును, వ్యాపారార్థమై మన దేశమునకు వచ్చిన బుడతకీచులును విశేషాధికారము సంపాదించిరి. మధురనాయకరాజ్యమును కబళించు నుద్దేశముతో తగిన తరుణమునకై వేచియున్న మహమ్మదీయులు రాణి మీనాక్షి కాలమునందలి కలుషిత వాతావరణము నాధారము చేసి

కొని పాండ్యరాజ్య వ్యవహారములలో జోక్యము కలిగించు కొని తుద కా రాజ్యమును తమ హస్తగతము చేసికొనిరి. ఇరుగు పొరుగురాజుల తోడి సంతత సమరములు, పాశ్చాత్యుల ప్రాబల్యము, అంతః కలహములు, మలిన మనస్కులగు మంత్రులకుట్రలు మొదలగునవి మధురనాయక రాజ్య పతనమునకు కారణము లయ్యె నని చెప్పవచ్చును.

తొలుత విశ్వనాథ నాయకుడు రాజ ప్రతినిధిగా నియమితు డై మధుర కేతెంచినపుడు ఆ నగరరాజము పూజా పురస్కారములు లేక బూజుపట్టిన యాలయమువలె నుండెను. పాండ్యమండల మంతయు చిట్టడవులతో నిండి యుండుటచే వన్యమృగములు ఎచ్చట చూచినను విచ్చలవిడిగా తిరుగుచుండెను. చోరభయ మధికముగా నుండెను. దుర్గములు శిథిలావస్థలో నుండెను. దేవాలయములు కళావిహీనము లై యుండెను. రాజ్యములో శాంతి భద్రతలు స్వప్నగత వృత్తాంతము లై యుండెను. తుదకు మధురానగరము కూడ దుస్థితిలో నుండెను. కావున మధురను పునరుద్ధరించు నభిలాషతో తన దళవాయి ప్రధాని అరియనాథ మొదలితోను, దళవాయి బిసపాకము కేశవప్పనాయనితోను సంప్రదించి విశ్వనాథనాయకు డా నగర దుర్గమును పునర్నిర్మించెను. అది ముగిసిన పిమ్మట విశ్వనాథనాయకుడు మీనాక్షీ సుందరేశ్వరులకు కన్నుల పండువు గొలుపు కోవెలలు కట్టించెను. ప్రజల కుపకరించు కార్య నిర్వహణములందు తన తండ్రి నాగమనాయకు డార్జించిన ద్రవ్యమును గూడ అతడు

వినియోగించెను. అత డట్టి త్యాగవీరుడు. కనుకనే విశ్వనాథ నాయకుడు దానశీలు డనియు, ప్రజారంజక పరిపాలకు డనియు పేరు పెంపులు గడించెను. అతని యేలుబడిలో పాండ్యమండ లము సర్వ విధముల వృద్ధికి వచ్చె నని నిస్సంశయముగా నుడువ నగును.

ఆనాళ్ళలో దక్షిణాపథమున పలుతావులందు చిట్టడవులు పెరిగియుండెను. అందువలన దుష్టమృగముల వలని భయ మధికముగా నుండెను. పలుగ్రామములు జనశూన్యము లై యుండెను. వ్యవసాయ సదుపాయములు లేకపోవుటచే మధురరాజ్యము చాలభాగము బీడువారి యుండెను. ఆ పరి స్థితులకు తోడుగా చోరభయ మెక్కుడుగా నుండుటచే ఆ కాలపు ప్రజలు పలుబాధలకు పాల్పడుచుండి రనుట నిర్వి వాదము. కనుకనే విశ్వనాథనాయకుడు మధురను పునరుద్ధ రించుటకు పూర్వము చిట్టడవులను ఛేదించియు, దుష్ట మృగములను తునుమాడియు, ప్రయాణికులకు రక్షణ కల్పిం చియు, బంజరుభూములలో వ్యవసాయము ప్రారంభించియు అతడు ప్రజల యాదరాభిమానములను చూఱగొనెను.

ముద్దు తిరుమల నాయకుని (1623–1650) కాల మున గూడ దుష్టమృగముల భయ మధికముగా నున్నట్లును, వ్యాఘ్రములను సంహరించినవాని కతడు గొప్ప బహుమాన మొసగినట్లును ఒక శాసనము సుస్పష్టము చేయుచున్నది. 1662 వ సంవత్సరమున ఒక పాదిరీ వ్రాసిన లేఖలో మధురా

నగర పరిసరములందు పులులు, తోడేళ్లు మున్నగు వన్యమృగములు సంచరించుచుండె నని పేర్కొనబడినది. ఈ క్రూర మృగములను జూచి ప్రజలు భయభ్రాంతులగుచుండి రనియు తెలియుచున్నది. కనుక పాండ్యమండలమున శాంతి భద్రతలను సుస్థిర మొనర్చిన విఖ్యాతి నాయకరాజులకు లభించినది.

మధుర నేలిన నాయకవంశీయులలో పేర్కొనదగిన వారు విశ్వనాథనాయకుడు, తిరుమలనాయకుడు, మంగమ్మ మున్నగువారు. కడమ నాయకరాజులు నామకః పరిపాలకులే కాని రాజ్యభారమును వారి మంత్రులే నిర్వహించిరి. విజయరంగ చొక్కనాథ నాయకునివంటి వారు రాజ్య వ్యవహారముల యందు విముఖత వహించి సతతము తీర్థయాత్రాచరణము నందే నిమగ్నులై యుండిరి. దేవస్థానములకు సంబంధించిన వ్యవహారములను మాత్రమే అతడు పర్యవేక్షించెడివాడు. కడమ వ్యవహారములను మంత్రులే పరిశీలించుచుండిరి. ఆ యవకాశమును పురస్కరించుకొని దురాశాపూరితు లగు ప్రభుత్వోద్యోగులు కొందఱు ప్రజలను బాధించి వారి యసంతృప్తికి పాల్పడిరి.

విజయరంగ చొక్కనాథనాయకుని కాలమున కస్తూరి రంగయ్య యనునతడు దళవాయిగాను, వేంకటకృష్ణయ్య యనునతడు ప్రధానిగా నుండినట్లు తెలియుచున్నది. కఠినచిత్తులయిన వారిరువురును ప్రభువునకు తెలియకుండగనే క్రొత్త పన్నులు విధించి వానిని వసూలు చేయుచుండిరి. విజయరంగ

చొక్కనాథుడు 1710 వ సంవత్సరమున వేయించినయొక శాసనమునందు విషాద గాథ యొకటి పేర్కొనబడినది. అది నాటి పరిస్థితులను సువ్యక్త మొనర్చుచున్నది.

పన్నుల భారమును భరింపలేక ఆలయభృత్యు డొకడు విధించిన పన్నులకు నిరసనసూచనగా గుడిగోపురము మీది నుండి క్రిందికి దూకి ప్రాణము వీడెనట! ఈ పన్నులభారమునకు తోడుగా కఱవు కాటకములు తరచుగా సంభవించుచుండెను. యుద్ధసమయములందు శత్రువీరులు కలకలలాడు బంగారు పంటలను నాశ మొనర్చుచుండిరి. గ్రామములను ధ్వంసము చేయుచుండిరి. అట్టి విషమ విపత్కర పరిస్థితులందు ప్రజలు పలుబాధలకు పాల్పడుచుండి రని వేఱుగా నుడువ నవసరమే లేదు.

ఒక్క మధుర రాజ్యము నందే కాదు ఇట్టి దురవస్థలకు ప్రజలు పాల్పడినది! ఆ నాళ్ళలో దక్షిణ భారతమున నున్న మైసూరు తంజపురాది రాజ్యములందును ప్రజలు పలు బాధలకు లో నయిరి. యుద్ధ వ్యయమును భరింపజాలక మైసూరు పరిపాలకు డొకడు తన రాజ్యమునందు పన్నుల నెక్కువ చేసెను. తత్ఫలితముగా మైసూరి ప్రజ లతనిని ప్రతిఘటించుటకును సన్నద్ధు లయిరి. ఆ ప్రతిఘటనము నణచి వైచుటకు కృతనిశ్చయు డై తిరుగుబాటుదారుల నె ట్లయినను సరే వధింపు డని మైసూరుపాలకుడు సైనికుల కాజ్ఞ యొసగెను. వర్ణవయోభేదములను గూడ పాటింపక

వారు కనబడిన వారి నందరను తమ కరవాలములకు నై వేద్య ముగా సమర్పించిరట. ఆ సమయమునందు కొన్ని శివ కేశ వాలయములు కూడ ధ్వంసము కావింపబడెననియు, ఆ యాల యములందలి ధనధాన్యములు ప్రభుత్వకోశాగారమునకు తర లింపబడె ననియు తెలియవచ్చుచున్నది.

మఱియొక విషాదగాథను పరికింపుడు:

1659 నుండి 1682 వరకు మధుర నేలిన చొక్కనాథ నాయకుని కాలమున మధుర తంజాపురాధీశ్వరుల నడుమ నొక ఘోరసంగ్రామము జరిగెను. అప్పటి తంజాపురాధీశ్వ రుడు విజయరాఘవ నాయకుడు. అతడు సతతము దైవధ్యా నమునందే నిమగ్నుడై యుండెడివాడు. ఈ యతి దైవ భక్తివలన అతడు తన ప్రజ లనుభవించు దురవస్థలను గూడ గ్రహింపజాలనిస్థితిలో నుండెను. ఆ ఘోర యుద్ధములో తంజావూరి విజయరాఘవ నాయకునకు తీరని నష్ట మేర్పడినది. గోరుచుట్టుపై రోకటిపోటనునట్లుగా ఆ సమయముననే గొప్ప క్షామ మొకటి సంభవించెను. వ్యాపారార్థమై మన దేశమున కేతెంచిన డచ్చివారా క్షామమును ఆధారము చేసికొని తంజావూరి ప్రజలను మిక్కిలి హింసించిరి. తండోపతండము లుగా ప్రజలు తమ తమ యిండ్లు వాకిళులను గూడ త్యజించి మధురకు పోయిరి. చొక్కనాథనాయకుడు వారి నందరను ఘనముగా నాదరించుటయే కాక వారికి కావలసిన సకల

సౌకర్యములు కల్పించెను. అత డా సందర్భమున ప్రదర్శించిన సహృదయత వర్ణనాతీతము!

అన్నార్తులైన ప్రజల కాహారసౌకర్యములు కల్పింతుమని నమ్మకము గొలుపు మాటలు చెప్పి, వారిని తమ వలలో వేసికొని డచ్చివారా దురదృష్టవంతులను తుదకు విక్రయించుచుండిరట! బెర్ట్రాండ్ అనుదార హృదయ విదారక మగు నా విషయమును కన్నులకు కట్టునట్లుగా తన లేఖలో నుదాహరించినాడు. "Shame, eternal shame to the Dutch, who cruelly speculated on the misery of the Indians! They enticed them to the coast by the bait of abundant food; then, when their number became pretty large and their strength a little recouped, they piled them up in their ships and transported them to other countries to be sold as slaves!" అట్టి సమయమున ప్రజలు పడిన యమయాతనను మన మూహించుకొనవలసినదే.

చొక్కనాథ నాయకుని కాలముననే బిజపూరు సుల్తాను వారి సైనికులు తిరుచ్చిరాపల్లి దుర్గమును ముట్టడించుటకు విశ్వప్రయత్నము చేసిరి. కాని యా దుర్గరాజము వారి వశము కాలేదు. అప్పుడు విఫలమనోరథులైన యా సైనికులు తిరుచ్చిరాపల్లి పరిసరముల నున్న పంటచేలమీదపడి వానిని సర్వనాశనము చేసిరి. గ్రామములను దగ్ధ మొనర్చిరి. శత్రుసేనల పైశాచిక చర్యలను చూడలేక మానధను లగు ప్రజలు

గుంపులు గుంపులుగా గృహములందు చేరి ఆ యిండ్లకు నిప్పుపెట్టుకొని దుర్మరణము చెందిరి. ఏదోయొకవిధముగ బలవన్మరణమునకు పాల్పడుటకు వా రభిలషించిరట !

యుద్ధసమయములందు పల్లె పట్టులలో నివసించు ప్రజలే ఆ విధముగా ఇడుములు పడుచుండి రనగా యుద్ధరంగములందు శత్రువీరుల నెదుర్కొను సైనికవీరులయవస్థ లా సర్వసాక్షి కే తెలియవలెను. 'మధురరాజైన తిరుమల రాయని చరిత్రము' అను నొక చారిత్రక లేఖనము నం దొక చోట నిట్లు పేర్కొనబడినది. "కొందరు చాలా గాయాల తీస్కొనినారు. కొందరు దప్పికి తాళలేక క్రిందపడి పొర్లాడు చున్న కాల్వలుగా వచ్చే రక్తాన్ని జలము అని భ్రమచే పానం చేసినారు..."

మధుర నాయకరాజుల చరిత్రను పరిశీలింపగా మఱి కీవిషయము తెలియవచ్చును. రాజు బలహీను డైనప్పుడును అతడు రాజ్యము నం దాసక్తి లేనివాడగునపుడును, రాజ్య వ్యవహారములు మంత్రులు మున్నగు నున్నతోద్యోగుల యధీనము నం దున్నప్పుడును, యుద్ధసమయము లందున ప్రజలు పలుబాధలకు లోనగుచుండిరి. యుద్ధవ్యయమున భరించు నుద్దేశముతో పాలకులు పన్నుల నెక్కువ చేయు టయు, తన్మూలముగా పాలితులు బాధావహు లగుటయు జరుగుచుండెను.

వస్తుతః మధురనేలిన నాయకరాజు లెల్లరును దాన వినోదులు. ధర్మమార్గాను వర్తులు; దయార్ద్ర హృదయులు. పరమతసహనమును ప్రదర్శించిన సహృదయులు. కళాపోష కులు. ప్రజోపయోగార్థము వారు సంతరించిన సప్తసంతాన ములు, క్రొత్తగా నిర్మించిన గ్రామములు, బాటలు మున్నగు నవి నాయకరాజుల సౌహార్ద సౌశీల్యములకు శాశ్వతకీర్తి స్తంభములు. ఇక వారు కావించిన దానధర్మములా నిరుప మానములు!

ఈ సందర్భమున విశ్వనాథనాయకుడు, తిరుమలనాయ కుడు, మంగమ్మ మున్నగువారు సంస్మరింపదగినవారు. తిరు మలనాయకుని యపూర్వ సృష్టి యగుతిరుమలనాయకుని మహాలు ప్రాచ్యపాశ్చాత్య కళాభిజ్ఞుల యాదరాభిమానము లను చూరగొనినది. నిజమున కది కమనీయకళాఖండము. అట్టి కళాఖండమును సృష్టించిన శిల్పాచార్యు లెంతేని ప్రశంస నీయులు.

కళలును, సాహిత్యమును సాధారణముగా శాంతి భద్రతలు వర్ధిల్లు రాజ్యమునందే వర్ధిలగలవు. మధురనాయక రాజులు సంతత సమరములందు నిమగ్నులై యున్నను వారికి గల కళాభిరుచి మాత్ర మందువలన హ్రాస్వము కాలేదు. ఇక మంగమ్మగారి వదాన్యత వర్ణనాతీతము. నేటికిని తమిళ నాడులోని మారుమూలల నున్న పల్లెపట్టు లందుగూడ ఆమె పేరు ప్రతిధ్వనించుట గమనింపదగు విషయము.

మధుర నాయకరాజుల కాలములో బ్రాహ్మణులు విశేష గౌరవాభిమానములు పొందుచుండిరని విదితమగు చున్నది. బ్రాహ్మణులు పలువురు మంత్రిత్వము నెఱపుచుండిరి. అంతే కాక సైన్యాధ్యక్షులుగా కూడ వారు నియమితులగుచుండిరి. అట్టివారిలో ప్రముఖుడు దళవాయి రామప్పయ్య. "ఇదం బ్రాహ్మ్యం, ఇదం క్షాత్రం" అను వాక్యమున కతని జీవితము లక్ష్యప్రాయము. అటులనే దళవాయి నరసప్పయ్య మొదలగువారు ఎంతో సమర్థతతో తమ విధ్యుక్త ధర్మములను నిర్వహించిరి. దుష్టస్వభావు డగుదళవాయి వేంకటాచార్యుని వంటివారు కూడ ఆనాటి మంత్రులలో కొందఱు లేకపోలేదు.

బ్రాహ్మణేతరులు కూడ మంత్రులుగా నియమింపబడుచుండిరి. అట్టివారిలో విశ్వనాథ నాయకునికి కుడిబుజముగా నుండిన దళవాయి ప్రధాని అరియనాథ మొదలి సంస్మరణీయుడు. మధురరాజ్యపు రూపరేఖలు దిద్దిన ప్రముఖులలో నతడొకడు. ఇంకను దళవాయి రంగన్న నాయడు, దళవాయి సముఖము వేంకట కృష్ణప్పనాయడు మొదలగువారు కూడ పేర్కొనదగిన స్వామి భక్తులు.

వర్ణాశ్రమ ధర్మసంరక్షకులుగా మధురనాయకరాజులు పేరు పెంపులు గడించినను వారు మహమ్మదీయ క్రైస్తవమతములను గూడ నాదరించిరనుట మరచి పోరాని విషయము. ఇరుగు పొరుగుల నున్న రాజ్యములందు క్రైస్తవ మత

ప్రచారకులు చెప్ప నలవికాని బాధలు పడుచుండగా మధుర రాజ్యమునందు మాత్రము వారు బాహాటముగా మతప్రచారము కావించుకొనుచుండిరి. అట్లని మధురలో వా రెట్టిబాధల ననుభవింపలే దని యర్థము చేసికొనగూడదు. కుమతులైన ప్రభుత్వోద్యోగులవలన వారు కూడ నిడుమలకు పాల్పడిరి. కాని వారు రాజానుగ్రహమునకు పాత్రు లగుటచే మధుర రాజ్యములో క్రైస్తవము బహుళవ్యాప్తి నందెను. మంగమ్మ మహమ్మదీయుల నాదరించుటయే కాక వారి మసీదులకు విరివిగా దానధర్మము లొనర్చినట్లు శాసనాధారమువలన వ్యక్తమగుచున్నది. ఆమె సర్వవర్ణములవారి ధర్మములను సంరక్షించుచుండెను.

రాజకుటుంబములం దా నాళ్లలో సహగమనము ప్రబలాచారముగా నుండెను. తంజావూరి విజయరాఘవ రాయల మరణవార్తను విని రాచనగరున నున్న మహిళ లెల్లరు చితియందు దూకిరి. మధుర నేలిన తిరుమలనాయకుని మరణానంతరము అంతఃపురాంగన లిన్నూరుమంది యతనితో సహగమన మాచరించిరి. అటులనే రామనాథపురము నేలు తిరుమలసేతుపతి విగతజీవుడైన పిమ్మట నతని నలుబదియేడుగురు భార్యలును చితి నెక్కిరి. అట్టియెడ ఒక్క మంగమ్మయే యీ యాచారము నతిక్రమించెను. పైపెచ్చు ఆమె సహగమనమును రూపుమాపదలచె ననియు నుడువనగును. కాని దీనిని స్పష్టము చేయు నాధారములు లేవు. ఒకవేళ మంగమ్మ యీ యాచారమును రూపుమాప యత్నించినను పూర్వా

చారములకు పట్టుగొమ్మగా నున్న యాదినములలో సంఘము నకు భయపడి మిన్నకుండెనేమో! ఈ యాచారము సామాన్య ప్రజలలో కూడ ప్రబలియున్నట్లు తెలియవచ్చు చున్నది. కావున రాజులవఱకే తదాచారము పరిమిత మై యుండెననుట పొసగదు. బహుకళత్ర గ్రహణమును, వేశ్యాంగనా గమనమును శ్రీగల భాగ్యశాలుర లక్షణములుగా నున్నట్లును విదిత మగుచున్నది. నైతికముగా ధనాఢ్యులు కొందఱు కొంతవఱకు పతనము చెందిరని మన మూహింపవచ్చును.

నాయకరాజులనాటి రాజకీయ, సాంఘిక, మతవిషయములను తెలిసికొనుటకు జెసూయిట్ పాదిరీలు వ్రాసిన లేఖలు మిక్కిలిగా తోడ్పడుచున్నవి. వారు క్రీ.శ. 1592 లో మధురలో క్రైస్తవమత వ్యాపనోద్దేశముతో నొక మిషనును స్థాపించిరి. దానికే మధుర మిషను అని పేరు. ఐరోపాలోని యధికారులకు మధుర తంజాపురాది రాజ్యము లందలి మతవిషయములను తెలియజేయు తలంపుతో పాదిరీలు లేఖలు వ్రాసినను, వానిలో నాటి రాజకీయ సాంఘిక పరిస్థితులు కూడ పేర్కొనబడుటచే 17 వ శతాబ్దపు దక్షిణాపథ సాంఘిక చరిత్రను తెలిసికొనుటకు వీ లగుచున్నది. ఫ్రెంచిభాషలో నున్న యీ లేఖలను ఆంగ్లములోని కనువదించిన శ్రీ ఆర్. సత్యనాథయ్యరుగారు ప్రశంసనీయులు.*

---

* వీరు ప్రస్తుతము అణ్ణామలై విశ్వవిద్యాలయమునందు చరిత్ర, రాజనీతి శాస్త్రము లందాచార్యులుగా నున్నారు. వీరి రచనములలో History of the Nayaks of Madura పేర్కొనదగినది.

ఆదినములలో పోర్చుగీసువారియెడల ప్రజలు ద్వేష భావము వహించియుండిరి. వారిని తెలుగువారు బుడతకీచు లనియు, తమిళులు పరంగి వారనియు వ్యవహరించుచుండిరి. బుడతకీచులు నిమ్న జాతులవారితో కలసిమెలసి సంచరించు చుండిరి. మద్యమాంసములను సేవించుచుండిరి. వారి ప్రవర్తనము మిక్కిలి యసభ్యముగా కనబడెనట. అందువలననే వారి సిరిసంపదలుగాని, ధైర్య స్థైర్యములుగాని నాటిప్రజను ఆకర్షింప లేకపోయెను. పైపెచ్చు వారు తాత్త్వికవిషయములను బోధించుట కనర్హులనియు ప్రజలు భావించిరి. బుడతకీచుల మీది ద్వేషభావముచేత ప్రజలకు జెసూయిట్ పాదిరీలన్నను ఆదరభావము కలుగలేదు. కాగా పాదిరీలకృషి చాలకాలము వరకు ఫలింపలేదు. రాబర్ట్ డి నొబిలి అను పాదిరీ రాకతో మధురమిషను చరిత్రలో నూతనాధ్యాయము ప్రారంభమయ్యెను. అతని కృషిఫలితముగా పలువురు బ్రాహ్మణులు కూడ క్రైస్తవమతమును స్వీకరించిరి.

1610 లో రాబర్ట్ డి నొబిలి వ్రాసినయొక లేఖనుండి మధురలోని విద్యావ్యవస్థకు సంబంధించిన యీ క్రింది విషయములు తెలియుచున్నవి.

మధురలో పదివేలమందికి పైబడి విద్యార్థు లుండిరి. ఒక్కొక్క తరగతిలోను ఇన్నూరు మున్నూరు మంది చదువు చుండిరి. విద్యార్థులందరు బ్రాహ్మణులే. ఉన్నత విద్యాభ్యాస మొనర్చు నర్హత వారికి మాత్రమే యుండెను. ఇతరవర్ణముల

వారి కా యధికారము లేకుండెను. విద్యార్థులదృష్టి యితర విషయములందు లగ్నము కాకుండుటకై వారి యన్నపానాదు లకు గాను విజయనగరాధీశ్వరులును, మధురనాయక రాజులును విరివిగా ధర్మకార్యము లొనర్చిరి. ఆ ధర్మకార్యముల వలన లభించు నాదాయము విద్యార్థుల తిండితీర్థములకును, అధ్యాపకుల జీతబత్తెములకును సరిపోవుచుండెడిది. ఉన్నత విద్యలో పలుభాగములు గలవు. వానిలో తొలుతటిది తత్త్వ శాస్త్రము. దానికి చింతామణి యనిపేరు. అది మైదేండ్ల చదువు. ఇంకను వేదాంతము మరికొన్ని భాగములుకూడ గలవు.

మధురలో పలుకళాశాల లుండె ననియు, వేదాంత శాస్త్రము ననేకులు అభ్యసించుచుండి రనియు, ఉన్నతవిద్యాభ్యాసము సంస్కృతమునందే జరుగుచుండె ననియు మరి యొక పాదిరీ వ్రాసిన లేఖనుండి తెలియవచ్చుచున్నది.

ఉన్నతవిద్యాభ్యాసము బ్రాహ్మణులకే పరిమితమై యుండినను, ఆ నాళ్లలో బ్రాహ్మణేతరులలోను సంస్కృత పండితు లున్నట్లు పాదిరీల లేఖలనుండి స్పష్ట మగుచున్నది. మతవిషయక చర్చలో ఒక కమ్మరి పాల్గొనెనట. పరయ డోకేసు (పంచముడు) సంస్కృత విద్వాంసుడై యుండెనట. ఒకమహిళ సంస్కృతమున అనాయాసముగ సంభాషించుచుండెనట. ఆమెకు సుప్రసిద్ధ సంస్కృత కవుల శ్లోకములు జిహ్వాగ్రము లై యుండెనట !

1609 లో రాబర్ట్ డి నొబిలి వ్రాసినయొక లేఖలో నాటి విద్యావ్యవస్థకు సంబంధించిన మరికొన్ని విషయములు పేర్కొనబడినవి.

శ్రుతి స్మృతులను వ్రాయుట దోషముగా గణింపబడు చుండెను. వానిని కంఠతః నేర్చుచుండిరి. అందులకు పది పండ్రెండు సంవత్సరములు పట్టుచుండెను. ఒక వేళ ఎవరైనను వానిని వ్రాయదలచిన, ఆ వ్రాయుట అతి రహస్యముగా జరుగవలెను. లేకున్నచో వ్రాసినవానిని శిక్షించుచుండిరి. కనుగ్రుడ్లను వెలికి తీయుటయే ఆశిక్ష.

పాదిరీల లేఖలలో మధురయందలి ప్రజాజీవనమునకు సంబంధించిన పెక్కువిషయము లుదాహృతము లగుట గమనార్హము.

ఆదినములలో శత్రువుల చేజిక్కుట అవమానకరమని మానధను లగుప్రజలు భావించుచుండిరి. ముఖ్యముగా గ్రామములందలి ప్రజలు శత్రువుల బారినుండి బయటపడుటకు బలవన్మరణమునకు గూడ సంసిద్ధు లగుచుండిరి. కొందరు తొలుత తమ సతీసుతులను సంహరించి పిదప తమ్ము తాము చంపుకొనుచుండిరి. మరికొందరు తాము నివసించు గృహములకే నిప్పు పెట్టుకొని దుర్మరణము చెందుచుండిరి. అందులకు కారణము విజయగర్వమున వైరి వీరు లొనర్చు పైశాచిక కృత్యములే యనదగును.

యుద్ధసమయములం దా నాటిప్రజలు భయభ్రాంతులై సంచరించినట్లు తెలియవచ్చుచున్నను, నాటి క్షత్రియులు మాత్రము మొక్కవోని ధైర్యసాహసములతో సంచరించు చుండిరి. వారు ఖడ్గములను, బల్లెములను ఉపయోగించు చుండిరి. ధనుస్సు, తుపాకి మొదలగువానిని వారు విసర్జించిరి. విపత్తును చూచి భయపడువారు వానిని ఉపయోగింతు రని వారు విశ్వసించిరి. పగరకు వెన్నిచ్చి పరుగిడుట నీచ మని వారు తలచిరి. రణరంగమున గెలుపో చావో అంతేకాని శత్రువుల చేజిక్కి జీవించుటకు వా రెన్నడును ప్రయత్నించి యుండలేదు. అట్టి జీవనముకంటె మరణమే శ్రేయస్కర మని వారి విశ్వాసము.

బ్రిట్టో యను పాదిరి 1683 వ సంవత్సరమున వ్రాసిన యొక లేఖలో ఆభిజాత్యసంపన్ను డగు హిందువు రాజువలె నివసించునని పేర్కొనెను. అతడు మాంసమును ముట్టడు. మద్యమును ముట్టడు. మద్యపానము చేయువారిని ఆదరభావమున చూడడు. ప్రతిదినము వేకువజామున స్నానము చేయును. పాదిరీల లేఖలనుండి ఆనాటిస్త్రీలకు సంబంధించిన కొన్నివిషయములు కూడ తెలియవచ్చుచున్నవి.

సచ్ఛీలము ఉత్తమధర్మముగా భావింపబడుచుండెను. కాని ఆనాటిసంఘమునందు - ముఖ్యముగ రాజులు, ఉన్నతోద్యోగులు, ధనికులు మున్నగువారిలో-సౌశీల్యము కొంచెము తగ్గుముఖము పట్టెనని నుడువవలసియున్నది. బహు భార్యా

త్వము, వేశ్యాగమనము ఆనాటివారికి పరిపాటిగ నుండెను. అంతఃపురములందు రాజులు పలువురు స్త్రీల నుంచుకొను చుండిరి. సామాన్యులకు కూడ ఉంపుడుగత్తె లుండిరి. సామాన్యస్త్రీలు రంగుచీరలు ధరించుచుండిరి.

అంతఃపురాంగనలే కాక సామాన్యస్త్రీలు కూడ సహగమనము నాచరించుచున్నట్లు విదిత మగుచున్నది. జెసూయిట్ పాదిరీల లేఖలలో ఒకదాని యందు దిగువ క్రింది యుదంత ముదాహరింపబడినది.

భర్త విగతజీవు డయిన పిదప, అతనిభార్య సహగమనము నాచరించుటకు యత్నించెను. అప్పు డామె చూలాలు! గర్భమునందలి శిశువును సంరక్షించు నుద్దేశముతో ఆమె బంధువు లామెను సహగమనము నాచరింపవలదని శతవిధముల కోరిరి. కాని వారిమాటల నామె పెడచెవిని పెట్టెను. తుదకు ఊరిపెద్దకూడ ఆమెను సమీపించి సహగమనము వలదని నుడివెను. ఆమెను పోషించు భారమును కూడ అతడు తనపై వేసికొనెను. అయినను లాభము హుళక్కియే అయ్యెను. ఆ యిల్లాలు సహగమనము నాచరించెను. ఈ యుదంతమునుండి సహగమనాచారము అంతఃపుర స్త్రీల లోనే కాక సామాన్యస్త్రీలలో కూడ వ్యాపించియుండెనని తెలియు చున్నది.

మధురనాయకరాజు లెల్లరు దైవభక్తు లగుటచే, ఆ నాళ్లలో దేవోత్సవములు మహావైభవముగా జరుగుచుండె

డివి. ఉత్సవాదులందు ప్రజలు కూడ శ్రద్ధాసక్తులు ప్రకటించు చుండిరని నుడువదగును. ఆనాటి ప్రజలు ప్రభుభక్తి పరాయణులు.

జెసూాయిట్ పాదిరీల లేఖలను పరిశీలించినచో ఆనాళ్లలో మతమునకు ప్రాధాన్య ముండె ననియు, రాజులే కాక ప్రజలు కూడ తమతమ మతసంప్రదాయములను గౌరవించు చుండిరనియు విదిత మగుచున్నది. హైందవాచార వ్యవహారములను పరిహాసించుపట్టులు కూడ వారిలేఖలలో లేకపోలేదు. అయినను నాయకరాజులనాటి మధుర రాజ్యమును గురించి తెలిసికొనుటకు జెసూాయిట్ పాదిరీల వ్రాతలు మనకు మిక్కిలిగా తోడ్పడుచున్నవి.

నాయకరాజుల కాలమునందు మధురరాజ్యము సర్వవిధముల నభివృద్ధికి వచ్చె నని నుడువుటయే యుక్తము. ఏలయన మధురనాయకరాజులకు పూర్వము పాండ్య మండలమున శాంతిభద్రత లున్నట్లును, వ్యవసాయ సదుపాయము లున్నట్లును తెలియవచ్చుటలేదు. దుర్గములు, గుడులు, గోపురములు మున్నగునవి శిథిలములై యుండెను. వాని నన్నిటిని పునరుద్ధరించుటయే కాక నాయకరాజులు పాండ్యమండలమును సస్యశ్యామలముగాను, సుందరారామముగాను, కమనీయకళాఖండముగాను తీర్చిదిద్దిరి. దక్షిణాపథమున కానవచ్చు

చున్న సత్రములు, చావడులు, ఆలయములు ననేకము లీ నాయకరాజుల కాలమున వెలసి యుండుట గమనార్హము. వీరు తెలుగువా రగుట మన కెంతయు గర్వకారణము. సహజముగా దయార్ద్రహృదయులు, దైవభక్తులు నగు నీ నాయకరాజుల కాలమున ప్రజలు కొన్ని కారణములవలన బాధావహు లైనను, మొత్తము మీద నాటి ప్రజాజీవనము సౌఖ్యప్రదముగా నున్నట్లు తోచుచున్నది.

# సింహళమును జయించిన తెలుగు మన్నీడు

చరిత్రకు తెలియవచ్చిన నాటి నుండియు వైఘనదీ తీరమున నున్న మధురానగరము సిరిసంపదలకు కాణాచి యై తనరారెను. ఈ నగరరాజము ప్రప్రథమమున పాండ్య మహీపతుల యధీనములో నుండెను. కనుకనే మధుర రాజ్యమునకు పాండ్యమండల మనుపేరు కలిగెను. పాండ్యులు బలహీను లయిన పిమ్మట వారిని జయించి చోళరాజులు మధురను వశము చేసికొనిరి. గంగైకొండ-చోళ బిరుదాంచితు డగు రాజేంద్ర-చోళుడే మధుర నేలిన మొదటి చోళ భూపతి యని చరిత్రకారులు తలచుచున్నారు. అటు పిమ్మట పాండ్యులు చోళులకు సామంతులై కాలము గడప సాగిరి. క్రీస్తుశకము పదుమూడవ శతాబ్దము నాటికి చోళ మహీపతుల ప్రాభవ ప్రాబల్యములు తగ్గుముఖము పట్టెను. తరుణమునకై వేచియున్న పాండ్యు లా యవకాశమును పురస్కరించుకొని మధురను తమ హస్తగతము చేసికొన ప్రయత్నించిరి. కాని వారు విఫలమనోరథు లయిరి.

ఇది యిట్లుండగా 1310 వ సంవత్సరమునందు ఢిల్లీ పాదుషా యైన అలా ఉద్దీనుచే ప్రేరితు డై అతని సేనాధిపతి యగు మాలిక్ కాఫర్ దక్షిణ భారతము మీదికి దండెత్తి వచ్చెను. అత డనేక విజయములు సాధించెను. పాండ్య మండలమును కూడ అతడు జయించెను. మాలిక్ కాఫర్ జైత్రయాత్రా ఫలితముగ దక్షిణాపథములో కూడ చంద్ర ధ్వజము విజయగర్వమున రెపరెప లాడసాగె నని పేర్కొన నగును.

అటుపిమ్మట 1336 వ సంవత్సరమున విద్యారణ్య స్వామివారి సాహాయ్యమున హరిహర బుక్క సోదరులు తుంగభద్రానదీతీరమున విజయనగరమును సంస్థాపించి హిందూ మతమునకును, తత్ సంస్కృతికిని ప్రాణప్రతిష్ఠ కావించిరి.

హరిహరరాయల మరణానంతరము మొదటి బుక్క దేవరాయలు సింహాపీఠి నలంకరించెను. అతని కుమారు డగు వీరకంపనరాయలు మహా సాహసు డగు యుద్ధవీరుడు. అతని నాయకత్వమున విజయనగర సైన్య ములు మధురను ముట్టడించి తన్నగరము నేలు సుల్తానును సంహరించి మధురను కైవసము చేసికొనెను. తత్ఫలితముగా మధురరాజ్యము విజయనగరరాజ్యమున లీన మయ్యెను. తదాదిగా విజయనగరాధీశ్వరుల ప్రతినిధులు పాండ్య మండల వ్యవహారములను పరిశీలింపజొచ్చిరి. వీరకంపనరాయలే మొదటి రాజప్రతినిధి యని విశ్వసింపబడుచున్నది.

రాజప్రతినిధి నియామకము జరిగినను ప్రాచీన పాండ్య మహీపతుల సంతతివారే మధురను పాలించు చుండిరి. కనుక వారిపై పర్యవేక్షణ సలుపుటయే రాజ ప్రతినిధి కర్తవ్య మై యుండెను.

సాహిత్య సమరాంగణ సార్వభౌముడని వినుతి కెక్కిన శ్రీ కృష్ణదేవరాయలవారి కాలమున కాంచీపుర నివాసియు, కాశ్యపగోత్రోద్భవుడు నగునాగమనాయని కుమారుడు విశ్వనాథనాయకుడు మధురలో నాయక రాజ్యమును స్థాపించె ననియు, కాగా రాయలవారి మరణాత్పూర్వమే - అనగా 1529 వ సంవత్సరమున - మధురనాయక రాజ్యస్థాపనము జరిగె ననియు కొందరు చరిత్రకారులు తలచుచున్నారు. రాయలవారి కాలమునగాక అచ్యుత దేవరాయల కాలమున మధురలో నాయక రాజ్య స్థాపనము జరిగియుండనోపునని మరికొందరు తలచుచున్నారు. అచ్యుత దేవరాయల కాలమున గూడ విశ్వనాథనాయకుడు దక్షిణదేశ ప్రతినిధిగా నుండె నని తెలియుచున్నది. కనుక విశ్వనాథ నాయకుని కాలమున గాక అతని కుమారుడగు మొదటి కృష్ణప్ప నాయకుని కాలమున మధురనాయక రాజ్య స్థాపనము జరిగె నని భావింపనగును. ఏది యెట్లున్నను, మధురను సర్వ విధముల నభివృద్ధికి తెచ్చిన మహనీయుడు విశ్వనాథ నాయకు డనక తప్పదు; అంగీకరింపకను తప్పదు.

విశ్వనాథ నాయకుడు 1564 వ సంవత్సరమున మరణించెను. అనంతరము అతని కుమారుడగు పెదకృష్ణప్ప నాయనయ్య రాజ్యమునకు వచ్చెను. చరిత్రకారు లితనిని మొదటి కృష్ణప్ప నాయకు డని వ్యవహారింతురు.

పెద కృష్ణప్ప నాయనయ్య తండ్రివలె పరమదైవ భక్తుడు; ప్రజారంజక పరిపాలకుడును. విశ్వనాథ నాయకుని కాలములోనే అతడు చాల గొప్పవా డని కీర్తి గడించెను.

పూర్వపు పాండ్యరాజుల సంతతివారితో సఖ్యభావమున సంచరించిన కారణమున, అతడు రాజ్యమున శాంతి భద్రతలు నెలకొల్పుటయే కాక పాండ్యకుల స్థాపనాచార్య అను బిరుదమును కూడ పొందెను. శ్రీమత్కాంచీ పురవరాధీశ్వర, మోకాలి పట్టవర్ధన, సమయద్రోహరగండ, ఐలావలీపురవరాధీశ్వర, తిరువడి త్ర్యంప, దక్షిణ మహా సముద్రాధీశ్వర – అను బిరుదములు కూడ అతనికి కలవని తెలియుచున్నది.

కృష్ణప్ప నాయకుడు సింహాసనమునకు వచ్చిన తోడనే మధుర రాజ్యము నందొక తిరుగుబాటు జరిగెను. దానికి నాయకత్వము వహించినవాడు తుంబుచ్చి నాయకుడను నొక పాళెగాడు. అతడు మహాసాహసుడు. విశ్వనాథనాయకుడు ప్రవేశపెట్టిన పాళెపు పద్ధతిని నిరసించి అతడు కొందరు పాళెగార్లను కూడగట్టుకొని కృష్ణప్ప నాయకుని ప్రతిఘటించెను. కనుక విశ్వనాథనాయకుని పాళెపు పద్ధతి అతని

కాలమున శాంతి భద్రతలు ప్రసాదించినను, కృష్ణప్ప నాయకుని కాలమునందే ఆ విధానము అనర్ధదాయకముగా పరిణమించెనని నుడువదగును. *

---

*పరిపాలన సౌష్ఠవము నుద్దేశించి విశ్వనాథ నాయకు డొక నూతన పరిపాలనా విధానమును చేపట్టెను. దీనినే పాళెము పద్ధతి యని యందురు.

ప్రాచీన పాండ్య భూపతుల సంతతివారును, వారి సామంతుల వంశీయులును, మహమ్మదీయుల బారినుండి తప్పించుకొను తలంపుననో, మరి యే కారణము వలననో ఉత్తరమునుండి యేతెంచి దక్షిణాపథమున స్థిర నివాసము లేర్పరుచుకొన్నవారును, వారి యనుయాయులును మధుర రాజ్యమున ఆయా ప్రదేశములందు పలుకుబడి కలిగియుండిరి. వా రెల్లరు సంతుష్టు లైననేకాని మధురలో శాంతిభద్రతలు సుస్థిరముగా నుండజాలవు. మీదు మిక్కిలి ఆనాళ్ళలో వ్యవసాయ సదుపాయములు తక్కువగ నుండుటచే మధుర రాజ్యము చాలవరకు బీడువడియుండెను. ఈ విషయాదికమును పురస్కరించుకొనియే దేశ క్షేమమును లక్ష్యముగా నుంచుకొని విశ్వనాథ నాయకుడు పాళెపు పద్ధతిని ప్రవేశపెట్టెను.

విశ్వనాథ నాయకుడు రాజ్యము నంతటిని డెబ్బదిరెండు పాళెములుగా విభజించెను. ఒక్కొక్క పాళెమున కొక్కొక్క యధికారిని నియమించెను. అతనికి పాళెగాడు అని పేరు. పాళెములకు సంబంధించిన సర్వ వ్యవహారములందును పాళెగార్లదే తుదిమాట. అందువలన పాళెగార్లు తమ తమ పాళెముల యభివృద్ధికి పాటుపడజొచ్చిరి. అంతేకాక విశ్వనాథ నాయకుడు రాజ్యమునందలి బిరుదుగల దొరల యాదరాభిమానములను చూరగొనగలిగెను. తత్ఫలితముగ మధుర రాజ్యమున శాంతిభద్రతలు సుస్థాపితము లయ్యెను. కనుక పాళెపు పద్ధతి విశ్వనాథ నాయకుని కాలమున సత్ఫలితములకు దారి తీసె నని నుడువదగును.

కృష్ణప్ప నాయకుని కాలమున మహామేధావి యగు అరియనాథ మొదలి దళవాయి ప్రధానిగా నుండెను. అతని యభిమతము ననుసరించి కృష్ణప్ప నాయకుడు తుంబుచ్చి నాయకునితో యుద్ధము సాగించుటకు సైన్యాధ్యక్షుడగు పెద కేశవప్ప నాయకుని నియోగించెను. పెద కేశవప్ప నాయకుడు స్వామి భక్తులైన పాళెగార్ల* సహాయముతో తుంబుచ్చి నాయకుని ప్రతిఘుటించెను.

ఉభయ పక్షముల వారికిని జరిగిన ఆ యుద్ధమున తుంబుచ్చి నాయకుడే విజయము సాధించెను. దళవాయి పెద కేశవప్పనాయడు వీరస్వర్గము నలంకరించెను.

దళవాయి పెద కేశవప్ప నాయని మరణానంతరము అతని కుమారుడు చిన కేశవప్పనాయడు సైన్యాధ్యక్షుడుగా

---

* దళవాయి పెద కేశవప్ప నాయని పక్షము వహించిన సరదార్లు: బంగారు నాగుల నాయడు, తోరయూరు నరసింహ నాయడు, మిట్ట పాలెం అయ్యప్ప నాయడు, గొజ్జంగి కోసల నాయడు, అమర గంటి ముద్దుల నాయడు, సుబ్బ నాయడు, తుపాకుల రామకృష్ణ నాయడు, వీర బాణం కస్తూరి రంగరాజు, లింగమరాజు, కొరవి కృష్ణమరాజు, మంద పాటి రాఘవరాజు, ఆవులమంద కృష్ణరాజు, వీరవల్లి రామరాజు, మల్లి పురం రంగనపతిరాజు, పూసపాటి కొండ్రాజు, పెమ్మసాని రుద్రప్ప నాయడు, నాదెళ్ల నార(ణ)ప్ప నాయడు, నారిగంటి నరసా నాయడు, నరావుల వెంకట్రామా నాయడు - మొదలగు వారు.

(సింహళ విజయం కైఫీయత్తు, ఇది చెన్నపురి ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారమున కలదు.)

నియమితు డయ్యెను. తుంబుచ్చి నాయకునితో మరల యుద్ధము ప్రకటింపబడెను. ఇరుపక్షముల వారికి పరమ కుడి అనుచోట భయంకర మైన యుద్ధము జరిగెను. అందులో తుంబుచ్చి నాయకుడు చిన కేశవప్ప నాయనికి పట్టు వడెను. పిమ్మట అతడు కృష్ణప్ప నాయకుని యాజ్ఞను శిరసావహించి తుంబుచ్చి నాయకుని శిరచ్ఛేదము కావించి యా శిరస్సును ప్రభు సమక్షమున నుంచెను. అటుల విద్రోహ చర్య తలపెట్టిన తుంబుచ్చి నాయకుని జీవితము విషాదాంత ముగా పర్యవసించుటచే మిగిలిన పాళెగార్లు మధురాపురా ధీశ్వరునియందు భక్తి ప్రపత్తులతో సంచరింపసాగిరి.

స్వామి ద్రోహము చేసిన కారణముచే తుంబుచ్చి నాయకుని శిరచ్ఛేదము కావించెనే కాని సహజముగా పెద కృష్ణప్ప నాయనయ్య కఠినమనస్కుడు కాడు. కనుకనే అతడు తుంబుచ్చి నాయకుని కుమారు లిద్దరిని మన్నించి వారిని పరమకుడి, పరంబూరు అను పాళెములకు అధికారు లుగా నియమించి సహృదయతను ప్రదర్శించెను.

తుంబుచ్చి నాయకుని మరణానంతరము కృష్ణప్ప నాయకుడు మరియొక తీవ్ర ప్రతిఘటనము నెదుర్కొనవలసి వచ్చెను. సింహళద్వీపమునకు రాజధానీనగర మైన కండిని పరిపాలించు నతడు తుంబుచ్చి నాయకుని ప్రాణ స్నేహితుడు. మిత్రుని దుర్మరణ మతని హృదయమును కలచి వైచెను. కాగా, కండిరాజు నలుబది వేల సైన్యమును సమకూర్చుకొని

కృష్ణప్ప నాయకునితో యుద్ధము ప్రకటించెను. అతడును సమరసన్నద్ధు డయ్యెను. దళవాయి చిన కేశవప్ప నాయని నాయకత్వమున మధుర సైన్యములు సింహాళ సైన్యమును పుత్తాళం అనుచోట మార్కొనెను. ఉభయులకు జరిగిన యా సమరమునందు సింహాళ వీరులు పలువురు మరణించిరి. చిన కేశవప్ప నాయనికి జయము లభ్య మయ్యెను.

అపజయము పొందినను కండిరాజు నిరుత్సాహము చెందలేదు. కాని అతని మంత్రులు, సైనికోద్యోగులు మొదలగువారు ధైర్యోత్సాహములు కోలుపోయి యుద్ధమును విరమింపుడని తమ యేలికను కోరిరి. అయినను అతడు వారిమాటలను లెక్కసేయక మరల అరువదివేల సైన్యము నెటులనో కూడగట్టుకొని దళవాయి చిన కేశవప్పనాయనితో యుద్ధమునకు దిగెను. అందు బుడతకీచులు కండిరాజునకు సహాయము చేసినట్లు తెలియుచున్నది. ఆ యుద్ధములో కూడ అంతిమ విజయము మధురకే లభించెను. కండివీరు లనేకులతోపాటు కండిరాజు కూడ యుద్ధములో మరణించెను. ఈ విజయ వృత్తాంతము మధుర నాయక రాజుల చరిత్ర యందే కాక తెలుగుల చరిత్రలో కూడ బంగరుటక్షరములతో వ్రాయదగినది. భారత సీమావధులను కూడ దాటిపోయి సింహాళమున పరిపాలనము సాగించినారు ఆనాటి తెలుగు వారు! *

---

* ఈ యుద్ధమునందు చిన కేశవప్ప నాయని అల్లు డగు మంగపతి నాయడు కూడ పాల్గొనినట్లు తెలియుచున్నది.

అటు పిమ్మట పెద కృష్ణప్ప నాయనయ్య తన "బంధువు లందరిని సముఖాన్కి రప్పించి చూచి అందులో యోగ్యుడున్ను, బుద్ధిమంతుడున్ను, మహా పరాక్రమశాలిన్ని, ఆకార రేఖా మహారాజ లక్షణవంతుడైన (తన) బావమరిది విజయగోపాల నాయని వారిని పిలిచి నీవు సింగ్గళ ద్వీపానికి రాజుగా వుండమని, పురోహితుల రప్పించి మంచి దినమున్ను, లగ్గమున్ను, ముహూర్తమున్ను చూచి ఆదినమంద్దు అచ్చటి గంగా జలమున్ను, ఆ దేశమంద్దుగల పుణ్యానదుల తీర్థములున్ను తెమ్మని అతన్కి అభిషేకం చేసి స్వర్ణ పట్టం మీద వ్రాయించి లలాటమున ధరియించ్చి...అంబారిలో విజయగోపాల రాజును సవారిగమ్మని సింహాళరాజుకు కలిగిన బిరుదులున్ను, పాండ్య దేశాధిపత్కి కలిగిన బిరుదులున్ను యిచ్చి" విజయ గోపాల నాయకుని * సింహాళములో మధుర రాజ్యాధిపతి ప్రతినిధిగా నియమించెను. అతని మూలముగా కండి రాజు నుండి పెద కృష్ణప్ప నాయనయ్య కప్పము గొనుచుండెను. ఈ ప్రతినిధి నియామకమును కొందరు శంకించుచున్నారు. కాని ఒక్క విషయము మాత్రము స్పష్టము. కండిని స్వాధీనము చేసికొనిన పిదప కృష్ణప్ప నాయకుడు

* చారిత్రక లేఖనములందు కృష్ణప్ప నాయకుని సింహాళ విజయము ప్రస్తావింపబడెను. కాని యీ విజయోదంతమును బలపరుచు శాసనాధారము లేదు. యుద్ధ కారణము ఇదమిత్థ మనియు తెలియ వచ్చుట లేదు.

తన్నగరపాలకుని నుండి కప్పము గ్రహించుచుండె నని నుడువదగును.

విశ్వనాథ నాయకునివలె విశేషముగా దానధర్మములు చేసియు, గుళ్లు గోపురములు కట్టించియు, చిట్టడవులు ఛేదించి గ్రామములు నిర్మించియు, చెరువులు త్రవ్వించియు విశేష విఖ్యాతి గడింపకున్నను మొదటి కృష్ణప్ప నాయకుడు సింహళ ద్వీపమును జయించిన తెలుగు మన్నీడుగా పేరు పెంపులు గడించినాడు. అత డొక్కడే కాదు. అలనాటి తెలుగువీరులు కూడ 'మేరు సమాన ధైర్యయశస్సిల కులు'గా చరిత్రలో చిరయశస్సు గడించినారు!

---

## ఈ గ్రంథమును రచించు నవసరమున సంప్రతింపబడిన రచనలు

ఆంధ్ర దేశమున చరిత్రపరిశోధన—

డాక్టర్ నేలటూరి వేంకటరమణయ్యగారు.

ఆర్యనాగార్జునుని విగ్రహవ్యావర్తని—

డాక్టర్ జి. వి. కృష్ణరావుగారు.

కావలి వేంకటబొర్రయ్యగారు—

శ్రీ నిడుదవోలు వేంకటరావుగారు.

చారిత్రక వ్యాసములు—శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారు.

నా యముద్రిత మధురనాయకరాజుల చరిత్ర

సరస్వతీమహాల్—శ్రీ ఆరుద్రగారు

Buddhist Remains in Andhra and The History of Andhra between 225—610 A. D.— Dr. K. R. Subramanian

History of the Nayaks of Madura—

Prof. R. Sathianathaier

South Indian Buddhist Antiquities

Tamilaham In the 17th Century—

Prof. R. Sathianathaier

